# లంకాదహనము

## అను విభీషణపట్టాభిషేకము.

అవసరాల శేషగిరిరావుగారిచే

రచింపబడినది.



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్‌సెల్లరు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000 ప్రతులు

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1926



వెల రు. 0-12-0

పూర్వకవుల పద్యకావ్యములు.

# శృంగారనైషధము.

శ్రీనాథుని ప్రణీతము రు 1—0—0.

# బిల్హణీయము.

చిత్రకవి సింగరార్యుని ప్రణీతము రు 0—8—0.

# శశాంకవిజయము.

శేషము వేంకటపతి విరచితము రు 1—0—0.

# మొల్లరామాయణము.

ఆతుకూరి మొల్ల ప్రణీతము రు 0—12—0.

# పారిజాతాపహరణము.

ముక్కుతిమ్మన విరచితము రు 1—0—0.

కొండపల్లి వీరవెంకయ్య, బుక్ సెల్లర్సు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శ్రీ

# లంకాదహనము

అను

## విభీషణపట్టాభిషేకము.

[ఏడంకముల నాటకము.]

ఆవసరాల శేషగిరిరావుగారిచే

రచింపఁబడినది.



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్ సెల్లరు, రాజమండ్రి.

రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1926.



[వెల రు. 0-12-0

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు

| | |
|---|---|
| శ్రీరాముఁడు. | సుషేణుఁడు. |
| లక్ష్మణుఁడు. | రావణుఁడు. |
| భరతుఁడు. | విభీషణుఁడు. |
| శత్రుఘ్నుఁడు. | కుంభకర్ణుఁడు. |
| వాలి. | ఇంద్రజిత్తు. |
| సుగ్రీవుఁడు. | వసిష్ఠుఁడు. |
| అంగదుఁడు. | వానరులు } సందర్భానుసారముగ వచ్చుచుందురు. |
| హనుమంతుఁడు. | రాక్షసులు } |
| జటాయువు. | పౌరులు } |
| సంపాతి. | ప్రహస్తుఁడు. |
| జాంబవంతుఁడు. | శుకుఁడు. |
| నలుఁడు. | సారణుఁడు. |
| నీలుఁడు. | సుపార్శ్వుఁడు. |
| | గరుత్మంతుఁడు. |

## స్త్రీలు

| | |
|---|---|
| సీత. | త్రిజట. |
| తార. | మండోదరి. |
| స్వయంప్రభ. | |



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము.



ప్రథమాంకము.



ప్రదేశము:— పర్ణశాల.

[రాముడు, లక్ష్మణుడు, సీత, ప్రవేశింతురు.]

సీత— ప్రాణేశ్వరా! మీరీ ప్రాంతమునందుంట హాని యగునా? ఈవన వాసమే నా కెంతయు నాహ్లాదకరముగ నున్నది. ఏమందురా?

(1 వ అనుబంధము)

ఉ. బంగరుమేడ లేల? మణి । భూషణ లేటికి? సౌఖ్య మబ్బునే
వెంగలులై సదా మదికి । వేడ్కను గూర్చుకాంతుఁ బాసి యే
యంగన లెంచఁజాలుదురు । యక్కట! సంపద లానఁజేసి యీ
భంగిని పల్కు టొప్పగునె? । భాగ్యము లేటికి నాథు వీడినన్.

పతివ్రతల కాత్మనాథసంగమంబులకు తుచ్ఛసుఖము లెవ్వటి!? సంతన సౌఖ్యములఁ గూర్పఁజాలవు

రాము— కాంతారత్నమా! నీవంటి సుగుణాలంకారిణి యగువనితను చేపట్టినందున కే నెంతయు ధన్యుడను గదా. ఏమైననేమి? సౌధాంతస్సీమలఁ గాలముఁ బుచ్చుచు, సుఖశయనంబులఁ బవ్వ ళించు నీకు నిన్నకారణముగఁ గఠినశిలావృతంబును, క్రూరదుష్టగ

నివాసయోగ్యంబు నగు నీఘోరావనులఁ ద్రిప్పుచుంటినిగదా.
ఇంతకును భ్రాతాజ్ఞ మీఱి వర్తింప నేరికి సాధ్యమగును.

సీత—నాథా! ఏను మీకంటె నెక్కుడు సుకుమారినా? రాజాధి
రాజనకుఁ బుత్త్రినై, యపారసంతస సౌఖ్యము లనుభవించుచు
నవరత్నఖచితమై యొప్పు సౌధముల వసించు మీరలు వనవాస
శ్రమ కోర్చియుండుట లేదా? ఇదియుఁగాక కంటికి ఱెప్పవలెఁ
గాచుచు మీరు దరినుండి నాకిసుమంతయైన విచార మొద
వునా? ఆసౌఖ్యము చేకూరునా?

రాము—తన్వీ! నీపల్కులు సత్యములే యగును. కాని, నా కొకసంశ
యము కలదు.

సీత—ఏమది?

రాము—ఇన్ని నీతుల నెఱింగిన నీవు పతివ్రతాధర్మమును దాఁటలేదా?

గీ. ధవునిపల్కుల జవదాఁటి । తరుణి తాను
వంతగించుట చెల్లునే । భావ్య మగునె?
చెప్పవశమాను నీతులఁ । జేయుటరుదు
మనసువచ్చినరీతిని । మసలుచుంద్రు.

సీత—(సిగ్గునఁ దల వంచుకొనును.)

రాము—సిగ్గువందుచుంటి వేల?

సీత—ఏ నట్టిందులకుఁ గోరియుంటినో, తెలిసియు నిట్లు నుడివిన నేమను
దాన?

రాము—ఓహో! అంతయుఁ ప్రేమయే కాఁబోలును.

[ప్రవేశము:—లక్ష్మణుఁడు.]

రాము—తమ్ముఁడా! ఇంతదనుక నెచ్చో నుంటివి?

లక్ష్మ—ఫలములకై పోయి కొనివచ్చితిని.

రాము—నీమో మెంతగవాడియున్నది!

చ. వనముల సంచరించువేళ । భారముగాదొకో సోదరా! సదా
మనమున శంకఁ జెందకిటు । మానక వెంటను వేఁగుదెంచితే
కనియు నెఱుంగ నెన్నఁడును । కానసీమలఁ బొందుకష్టముల్
అనయము నిద్రాహారములు । నంటక నెట్టుల వెళ్ళఁబుచ్చెదో?

లక్ష్మ—సోదరా! నాకై మీ రిసుమంతయుఁ జింతనందవలదు. నాకేమియు శ్రమ యని తోఁచుటలేదు. నిరతము మీ పాదసేవ కన్న వలయు భాగ్య మేమి? ఇదియే నాకు సర్వార్థసిద్ధిదాయకము.

రాము—లక్ష్మణా! ఆహా! నీసోదరునియందు నీకుఁగల యభిమాన మపారముగదా. నిక్కముగ నీవు నాదరిని లేకున్న నే నిట్లు కాలమును గడుపుట దుర్లభముసుమా.

సీత—మఱఁది! లక్ష్మణా! మాకై యెట్టియిడుమలందుచుంటివి!

లక్ష్మ—అమ్మా! మీ రట్లనుట న్యాయమగునా?

(౩ వ అనుబంధము.)

సీత—(ఆతురతతో) నాథా! నాథా! ఇదిగో చూడుడు. ఆహా! ఏమిసౌందర్యము! బంగరువన్నె-కాదు-కాదు-నిక్కముగ దానిశరీరమంతయు బంగరుచేతనే నిర్మింపఁబడినది. ప్రాణేశ్వరా! ఆకురంగమును బట్టి యిచ్చెదరా?

రాము—(పరికించుచు) తన్వీ! ఇదెంతయు నాశ్చర్యముగనున్నది.

ఉ. కన్నులఁ గాంచ మెన్నఁడును । కాంతరో! యిట్టికురంగ మీభువిన్
మున్నదటంచు నెంచ మెపు । డూహలనైనను దానవేయి లే
పన్నిరి మాయ లీవిధిని । బట్టఁగ నేటికి నిక్కమైన నీ
వన్నెఁ జెలంగునే సుదతి! । వాంఛను వీడుము లేడి కాదు గా.

సీత—ప్రాణేశ్వరా! నా యీకోర్కెను దీర్పఁజాలరా?

రాము—కాంతా! తీర్పఁజాలక కాదు. రాక్షసకృత్యంబుల నెఱుంగ సా

ధ్యము కాదు. ఎవ్వఁడో రక్కసుఁడు మనల వంచింప నిట్లు మాయామృగరూపమున వచ్చియుండనోపు. నీయీప్సితార్థముల నెఱవేర్ప నాకుఁ గష్టతర మగునా?

సీత—అయిన నిఁక సందియమేమిటులకు? నామనోభీష్టమును దీర్పుఁడు.

రాము—ఆర్యా! ఎన్నివిధములఁ జెప్పినను నీపట్టినపట్టును వీడకుంటివి కదా! అబలలు తామున్న యుపద్రవముల నిసుమంతయు గ్రహింపఁజాలక కోరినవాని నెల్లఁ దెచ్చి యిమ్మందురు.

సీత—(ఖిన్నవదనయగుచు) పోనిండు. ఇట్టి నిర్దయాపరులై వర్తింతురని యెన్నఁడును దలంపలేదు.

రాము—(తనలో) ఓహో! ఈమె తాను గాను చింతాక్రాంతురాలై, నిష్ఠురోక్తుల వెలిబుచ్చ నారంభించెను. ఎట్లైన నిఁక దప్పి నట్లు తోఁచుటలేదు. (ప్రకాశముగా) ప్రాణేశ్వరీ! ఈకఠిన వాక్యము లేల?

గీ. పట్టి తెచ్చెద నిప్పుడే । పడఁతి! మదిని
శంకలంకుట యొప్పునే । సాధ్యమైన
ప్రాణములతోనె కొనవత్తు । భంగమైన
మృతశరీరము నేఁ దెత్తు । ముఖ్యమిదియు.

(అని బాణమును గొని బయలువెడల నుద్యుక్తుఁడై లక్ష్మణునిఁ గాంచి) లక్ష్మణా! ఈసీతను జాగ్రత్తఁ గాచుకొనియుండుము. నే నిప్పుడే మాయాకురంగమును బట్టి తెచ్చెదను.

లక్ష్మ—అన్నయ్యా! మీరును నిట్లు త్వరపడుట న్యాయమగునా? ఇది రాక్షసమాయయే కాని, నిక్కముగ కురంగము కాదు. ఎవ్వఁడో దుర్మార్గుఁడు మనల మోసగింప నిట్లు వచ్చియుండెను. అది తెలిసియు నిట్లు వేగిరపడ న్యాయమా?

రాము—నిక్కమే. కాని, సీతకోర్కెను దీర్పుటయే కర్తవ్యకార్యముగఁ

దలంచితిని. అది నిక్కమగు లేడియే యగునేడఁ బట్టి తెచ్చి యీా మెరు సంతసింపఁజేయువాఁడ. కావున్న భీతియేల ? క్షణకాల ముననే రూపుమాపి వచ్చెదను.

గీ. వంచనయె సేయనెంచిన ॥ పట్టి దునిమి
దుష్టసంహార మొనరింతు ॥ నష్టమేమి?
భీతియేలను వినఁ మింక ॥ సీతకోర్కె-
దీర్చు టెంతయు నొప్పగు ॥ ధీరమతిని.

సీత—నాథా! పోయిరండు.

లక్ష్మ—అయ్యో! స్త్రీలు తాముపట్టినపట్టును వీడరుకదా!

సీత—లక్ష్మణా! నా యీాచిన్నకోర్కెను దీర్పవలదందువా?

లక్ష్మ—సాధ్వీ! అది మాయామృగమే కాని, నిక్కమగు హరిణముకా కుండునని యిట్లు నుడివితిని.

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! ఈమెను బహుజాగరూకతతోఁ గాచు చుండవలెను సుమా. ఒంటరిగ వీడి యెచ్చటకును బోవలదు. అట్లైన దుష్టరక్కసులవలన ప్రమాదము సంభవింపవచ్చును.

లక్ష్మ—చిత్తము. కాని, తా మేఁగుటమాత్ర ముచితముకాదు.

రాము—ఇప్పుడే తిరిగి వచ్చెను.

(అని రాముఁడు నిష్క్రమించును.)

(సీత, లక్ష్మణుఁడు, రాముఁడువోయినదారివైపునకుఁ జూచుచుందురు.)

సీత—మఱిదీ! లక్ష్మణా! నాథుఁడెంతగ యత్నించినను నాసారంగము పట్టువడుటయే లేదు. ఎంతచమత్కారముగఁ దప్పించుకొను చున్నది.

లక్ష్మ—కానిమ్ము. కొలఁదినిమిషంబుల నన్నిచిత్రవిచిత్రములును దేలఁగలవు.

సీత—మీాయన్నగారి జాడయే కన్పట్టుటలేదు. ఎంతదవ్వరిగిరోకదా.

లక్ష్మ—వలదన్న వింటివా? వనిత లెందును దమయభీష్టమే తీర్చుకొన యత్నింతురు కాని, యెంతగబోధించినను బెడచెవిని దాల్తురు.

సీత—లక్ష్మణా! నీపల్కులునిక్కములు. సాధుని నిష్కారణముగనిష్ఠురములాడి శ్రమలందఁజేసితిని. తిరిగివచ్చినను లెన్నగనుండును గదా.

లక్ష్మ—అన్నియు మనయిష్టానుసారమే జరుగునా?

సీత—(ఏమియోవినుట నభినయించి తత్తరమున) లక్ష్మణా! ఏదియో యార్తారవము వినవచ్చుచున్నది.

(ఇరువురును వినుట నభినయింతురు)

[తెరలో] హా! లక్ష్మణా! హా! సీతా! ఈదుష్టరక్కసునిచే—

సీత—(కన్నుల నీరుపెట్టుచు) లక్ష్మణా! లక్ష్మణా! మీయన్నగారి కేదియో ముప్పువాటిల్లినది. వినియు నిట్లూరకుంటివేల? వేగిరంబుగఁ బొమ్ము.

లక్ష్మ—ఇట్లు భీతిలెడుదాన వెందులకుఁ బంపితివి?

సీత—నిష్ఠురోక్తుల కిదియాసమయము దొరకినది! తడయుటకు వేళ కాదు. త్వరపడుము, త్వరపడుము.

లక్ష్మ—రాక్షసకృత్యమది యని యేను తొలుత నుడివియుండలేదా?

సీత—గతించినదానినిగూర్చి తర్కవితర్కము లేల? వేగముగఁ బోయి నీసోదరునకు సాహాయ్య మాచరింపుము.

లక్ష్మ—అమ్మా! సీతా! ఎంత బేలవు. శ్రీరామచంద్రునకుఁ బరుఁడెగ్గొనరింపఁజాలునా?

ఉ. రక్కసు లెందఱైన దునిమె । రామునిఁ గన్నులఁ దేఱిచూడఁగా
నెక్కడి? శక్యమానె? నతఁ । డిప్పుడె రక్కసుఁ గూల్చియుండఁగా
సొక్కుచు నేలఁగూలియును । జూపెను మోసము తథ్యమా నిదే
వెక్కసమంద నేల మది । వీడుము చింతల తల్లిరో యికన్.

సీత—లక్ష్మణా! నీశాంతివచనంబుల కిది యదను కాదు. ఆపదయే లేకున్న నట్లు కేకలిడునా? పోయిరమ్ము. జాగు సేయకుము.

లక్ష్మ—తత్తరపడకుము. అబలవగుటచే నిట్లు భీతిలుచుంటివే కాని, రామున కేమి? ఆపదలు కలుగుట యేమి? అసహ్యాత్ముండగు రక్కసుఁడే రాముని బాణమున కెఱయగుచు, అవసానకాలమునఁ గూడ మనల వంచింప నిట్లు రాముని పగిది కేకలిడియుండును. సోదరుఁ డామృతదేహమునుగొని తిరిగి వచ్చుచునేయుండును.

సీత—(తనలో) అయ్యో! ఈతఁడెంతగ బ్రతిమాలినను వినకున్నవాఁడు. ఏలొకో! నాహామనేతి మదరుచున్నయది. (ప్రకాశముగా కోపముతో) లక్ష్మణా! సోదరున కాపద జనించినను చూచుచు నూరకుండుటయే నీకుఁ బ్రీతియా?

గీ. నాథుఁ డాపదలంజిక్కి । వ్యాకులమగు నె
ప్రల్లదంబుల పల్కుచుఁ । బరఁగు టిట్లు
సోదరుండంచు నెంచెనే । సుహృదయమున
దలఁపఁ డిట్టి నీచుఁడవంచు । దర్పమంచు.

నిన్ను నమ్మి యామహానుభావుఁ డెట్లుమోసపోయెను. గోముఖ వ్యాఘ్రము వంటివాఁడవని యెన్నఁడును దలఁచియుండ లేదుకదా.

లక్ష్మ—తల్లీ! సోదరుఁడన్న నాకు విశ్వాసము లేదా? మీ రిట్లు పలుకుటపాడియా! మిమ్ముల నొంటిగ విడచిపోవలదని యాజ్ఞాపించుట వినియు నిట్టి నిష్ఠురోక్తుల వెలిబుచ్చిన నేమచువాఁడ. ఇట్లకారణముగఁ దాము చింతిలుటయుఁ దగదు. ఏకార్యమునందును ద్వరపడు టుచితముకాదు. అందువలన ననేకకష్టములు సంభవించును.

సీత—నీదురుద్దేశమంతయు నిప్పటికి వెల్లడియైనది. ఛీ!

ఉ. కాననసీమ సాధుఁ డిటు । కాయముఁ బాసిన నన్నుఁ బట్టి యి
ద్దాన సుఖంప నెంచితివొ? । ధాత్రి ఖలుండవు దుర్మదాంధ నీ
పీనులఁ దాఁకవొక్కొ? పతి । పిల్చెడు కేకలు క్రూరబుద్ధిచే
దానవు మాయయంచు మదిఁ । దాల్మివహించిన నోర్చుదాననే.

లక్ష్మ—హరిహరీ! (అని చెవులుమూసికొనును.)

సీత—నమ్మినవారికి ద్రోహ మొనర్ప నెంచిన ఘాతుకుఁడవు. నీమోమును జూడరాదు. ఏను నీకు లభించుదానసని కలనైనఁ దలంపకుము.

(3 వ అనుబంధము.)

లక్ష్మ—(విచారముతో) అక్కటా! ఎట్టి వినరాని దుర్భాషలవినవలసి వచ్చెను. అయ్యో! ఏనాఁ డెట్టి మహాపాతక మాచరించియుంటి నోకదా! (ప్రకాశముగా)

(4 వ అనుబంధము.)

మాతా! ఇట్టి దుర్భాషల నాడుట తగునా? కటకటా! ఏనంతటి కలుమషప్రవర్తకుఁడనా? ఈఘోరాటవిని నిన్నువీడి చనిన నెట్టియిడుమలు కల్గునోయనియు, శ్రీరామచంద్రుని శక్తిసామర్థ్యంబులఁ బూర్తిగ గ్రహించియుంటచేతను, నూరకుండఁజాలితినేకాని, అయ్యో! ఏనంతపాపినా? దుర్మదాంధుఁడనా? తల్లీ!

సీ. శ్రీరాము నిత్యము । సేవించుటయెకాని
యితరచింతల మది । నెంచలేదు
భగవానుఁడంచును । భావించుటేకాని
దుర్బుద్ధి యెన్నఁడు । దోఁచలేదు
పరమభక్తిని గొల్చి । వరలుచుండుటెకాని
యొగ్గునెన్నఁడు దాల్ప । నెంచలేదు
పతితపావనుఁడని । పల్కుచుండుటెకాని
ద్రోహమాచరింపఁ । దోఁపలేదు

గీ. కటకటా! యిట్లు దూషింప ౹ ఖలుఁడ వంచు
వినఁగరానట్టి పల్కుల ౹ వినఁగవలసె
నింక నిక్కము ఖలుఁడ నే ౹ నిట్టి పల్కు
లను వినియు జీవములతోడ ౹ మనియునుంటి.

సీత—సరి. సరి. తొలుతనుండియు నీ నక్కవినయములచేతనే నీ యన్నగారు మోసపోయిరి. ఎందులకీ వృథాలాపములు. నీదు ర్బుద్ధి నీకే కీడును గలుగఁజేయును. ఎంతదుష్కర్ముఁడైనను, ఎట్టి నీచుఁడైనను సోదరుని భార్యను గూడ నెంచునా? ద్రోహీ! ఇందులకేనా, భక్తివిశ్వాసములఁ గపటభావమునఁ జూపి, వనములకు మాతో నేగుదెంచితివి?

లక్ష్మ—(తనలో) అక్కటా! ఏమిసేయువాఁడ. ఇటనుండి కదలిపోయితి నేని అన్నగారియాజ్ఞను జవదాఁటినవాఁడనగుదును. పోకుంటి నేని యీసీతాదేవి మూర్ఖత్వంబునఁ బల్కుపల్కులను జెవిఁ దాల్పలేకున్నాను. హా! విధాతా! నన్నేందులకీయిల జన్మింపఁ జేసితివి? ఏమియును దోపకున్నదే. ఎట్లైన నీపెను ర్భావల నుండి తొలఁగిపోవుటయే యుచితము. (ప్రకాశముగా) సాధ్వీ! అన్నగారి యాజ్ఞాబద్ధుఁడనయ్యు, నీనిష్ఠురోక్తులచే నతిక్రమించి వెడలువాఁడ. జాగ్రత్తగ నుండుము.

సీత—మంచిది. పోయిరమ్ము.

లక్ష్మ—ఓపంచభూతములారా! సకలదేవతలారా!

సీ. కరుణించి బ్రోవరే ౹ కాంత సీతను మీరు
విడచిపోవుచునుంటి ౹ వేల్పులార!
దయను రక్షింపరే ౹ ధాత్రీసుతను సాధ్వి
నడవి నొంటరినుండు ౹ యతులార!

వేగ్మితోఁ గావరే । మర్మమెఱుఁగని రాము
సానుభూతిని జూపి । సాధ్యులార!
కృపను వీక్షింపరే । కిల్బిషాపహరుఁడౌ
శ్రీరాము రాణిని । సిద్ధులార!
గీ. నిష్ఠురోక్తుల వెలిబుచ్చ । నిలువలేక
రామునాజ్ఞను జవదాఁటి । రమణిబాసి
పోవనయ్యెను మార్గైనఁ । బోవరందు
పంచభూతములార! యీ । భామకడకు.

(అని నిష్క్రమించును.)

[ప్రవేశము:—రావణుఁడు భిక్షుకునిరూపమున]

(5 వ అనుబంధము.)

రావ—(తనలో) ఆహా! ఇప్పటికి కదా వాకోర్కె ఫలించినది. మాయమాయలఁ జిక్కి రాముఁడును, లక్ష్మణుఁడును గూడ వెడలిరి. త్వరితమున నీమెను జేరి నా యభీష్టమును దీర్చుకొందును గాక. (పర్ణశాలను సమీపించి) ఏమి యీమె సౌందర్యము! తడసిన ప్రమాదము సంభవించును. (ప్రకాశముగా) భవతు భిక్షాందేహి.

సీత—(రావణునిఁ జూచి) ఓహో! ఎవ్వరీ మునిపుంగవుఁడు భిక్షకై యేతెంచెను! (అనిలోనికేఁగి భిక్షునుగొనివచ్చును)

రావ—ఓ కాంతారత్నమా! నిన్నుఁజూడ నంతఃపురకాంతవని తోఁచుచున్నది.

ఉ. ఎవ్వరిదాన వీవు పతి । యెవ్వఁడు కాంతరో తెల్పు మంతయున్
యివ్వనవాస మేవిధిని । యేర్పడె నీకును సౌకుమారివే
యివ్విధి రూపుమాపి కడు । హీనత సొక్కుచుఁ బొక్కనేల, లే
తెవ్వరు దాపునన్ యిపుడ । దేమిరయో తోఁపదు నిక్కమేదియో.

సీత—ఆర్యా! మునికులసత్తమా! మీ రెఱుంగనివిషయములుండునా? ఏను రాజాధిరాజై లోకప్రసిద్ధిగాంచిన దశరథునికోడల నా శ్రీరామచంద్రుని ధర్మపత్నిని. జనకునిపుత్రికను. సీత యను దాననుం. కొండొకకతంబున దశరథమహారాజుచేవరములఁబడసి యాతనిమూడవభార్య కైకయనునామె తనపుత్రునకు రాజ్య మిమ్మనికోరి, నానాథుని వనములకుఁ బాపున ట్లాజ్ఞాపించెను. తత్కారణమున నిట్లు పదునాల్గువత్సరము లీవనములఁ గడుప వలసినవారమైతిమి.

రావ—తన్వీ!

గీ. సౌధసీమలవసియించు । సౌకుమారి
వయ్యు నీరీతి వనముల । నడలనేల?
రమ్ము నాతోడఁ జరియింప । రత్నసౌధ
ములను జేరి వేడ్కను, చింత । దొలఁగి వేగ.

సీత—(భీతివభినయించుచుఁ దనలో) అమ్మో! ఈతనిరూపుచూడలకింప మునివలెనుండెనేకాని పల్కులు వేఱువిధంబుననున్నవి. హా! దైవమా! ఇది రాక్షసమాయ కాదుకదా.

రావ—సీతా! తత్తరపడెద వేల? నానిజవృత్తాంత మెఱింగించెద నాలకించుము. ఏను లంకనునేలు రావణుండను. నీయొక్క సౌందర్యాతిశయంబుల నెంతయు వింతగ విని నిన్నుఁ జేపట్ట నిచ్చగించి పిదప నేనిందుఁ జేరితిని.

సీత—హారామా! నన్నీదైత్యాధముండు బలిమినిబట్ట మాయవేషధారుఁడై యేఁగుదెంచెను. రక్షింపుము. రక్షింపుము.

రావ—నాతీ! నీకేక లిందు నిరర్థకము. ఇదియుఁగాక,

గీ. నీదుసౌందర్యమును జూచి । నెలఁత నిన్నుఁ
గోరి మనమున వచ్చితిఁ । గోర్కె మీఱ

రాముఁడేలను నీకింక । రమణి యిట్లు
వనములను జేర్చి యిడుములఁ । బాలు సేయు.

సీత—ఛీ! దురాత్మా! పతి యెదలేని భామల నిట్లు దుర్భాషలాడఁ దగువా? పతివ్రతల నిట్లు పరిభవింప నీకెట్లు బుద్ధిపొడమెను? ఇట్లు పాపాంధకారనిమగ్నులైనవారిని దైవము దండింపఁడా?

రావ—నాకన్న దైవమెవ్వరు? ముల్లోకంబుల నేకచక్రంబునఁ బాలించు నన్ను దండించువాఁడింకొక్కఁడుండెనా?

సీత—ఓరీ! మూర్ఖా! ఎవ్వరోయన నేల? దుష్టసంహారకుఁడగు శ్రీరామచంద్రుఁడే నిన్ను నిమిషమాత్రమున సునుమఁగలఁడు.

రావ—అట్టి యసహాయశూరుఁడే యైనచో చేనున్న రాజ్యమును వీడి వనములకు రానేల?

సీత—ధర్మపత్నీపాతియగుటచే

రావ—ఒకవేళ బలవంతుఁడే యనుకొందము. అయిననేమి? ఇప్పుడు నీదరి లేకుండెనుగదా. ఇంతే!

ఉ. దాచగనేల మూరుఁ డతి । తాపముఁగొల్చుచు నుండెనయ్యయో
ఓచపలాక్షి వేడిమికి । నోర్వఁగఁ జాలను కావు మిందునన్
దోచకు వీడిపోవ సిను । తొయ్యలి యెట్టులుఁబోవనేర్తు నే
కాచినఁ గావకున్న నికఁ । గాంతరొ నిన్నదె నమ్మియుంటిగా.

ఇదియుఁగాక,

సీ. సేయింతుఁ బరిచర్య । సేవకులం బెట్టి
యొంటిమై యీరీతి । నుడుగనేల?
హంసతూలికపాన్పు । లందుండఁ జేసెదన్
కఠినంపు నేలలఁ । గడపనేల?
పసిడిపుట్టములెన్నొ । భక్తితో నర్పింతు
నారచీరలఁ గట్టి । నడువనేల?

ఉద్యానవనసీమ । నువిద చరింపక
ఘోరవనములఁ జేరి । కుందనేల ?

గీ. అట్టిసౌఖ్యంబు విడనాడి । యతివయింక
పొందరానట్టి యిడుమలఁ । బొందుటేల ?
రమ్ము నాతోడ లంకకు । రాజ్యలక్ష్మి
నీకె చెందును రమణిరో । నిజము నమ్ము.

సీత—హా ! రామా ! రామా ! (6 వ అనుబంధము)
లక్ష్మణా! నీపల్కులయందలి యర్థమించుకయు గ్రహింపఁజాలనైతినిగా.

రావ—సీతా ! నా యీసన్యాసిరూపమును జూచి వెఱపందుచుంటివి కాఁబోలును. నా నిజరూపమును గాంచుము. అప్పుడైన నమ్మింతువు.

(అని నిజరూపమును బొందును)

సీత—హా ! రామా ! హా ! లక్ష్మణా ! (అని మూర్ఛనొందును.)

రావ—అయ్యో ! ఈమె మూర్ఛను మునింగినది. చాలతడవైనది. రామలక్ష్మణులు లేతెంచువేళయైనది. నావిమానముపైనుంచి లంకకుఁ గొంపోయెదఁ గాక.

(తెర పడును.)





శ్రీ

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము



## ద్వితీయాంకము.



[తెరలో]

రాము—లక్ష్మణా! ఇదియేమి? సీత నొంటరిగ విడిచివచ్చితివా?

లక్ష్మ—అన్నయ్యా! ఆరక్కసుఁ డవసానకాలంబున నిడిన కేకలనువిని వినరాని దుర్భాషలనాడుచు, నే నెన్నివిధములబోధించినను వినక, పొమ్మనుటచే సీతాదేవిని విడనాడి రావలసినవాఁడ నైతిని.

రాము—అయ్యో! ఎంతపనిచేసితివి. అవినీతులగు వనితలమాటల లెక్కచేసి రాఁదగునే. ఏమిముప్పువాటిల్లునోకదా? ఎందువలననో నాహృదయము పరితాపాగ్నిచే దహింపఁబడుచున్నది. త్వరితముగఁ బోవుదము రమ్ము.

(తెర యెత్తఁబడును.)



ప్రదేశము:—పర్ణశాల.

[రామలక్ష్మణులు ప్రవేశింతురు.]

రాము—తమ్ముడా! ఇంకెక్కడిసీత? హతభాగ్యుఁడనైతిని. అయ్యో!

ఉ. దేవియె కావరాదిచట । దీనుఁడనైతిని లక్ష్మణా యికన్
యేవిధిఁ జూతు నింక సతి । నెవ్వరు చోరులు గొంచుఁబోయిరో

యీవనవాసమే తనకు । నింపగునంచును వెంటవచ్చెఁ దాఁ
గానఁగఁ జాలనైతి నిఁకఁ । గాంతను సీతను గాంచు టెట్టులో.

లక్ష్మణా! ఆ కాంచనకురంగము వెంటఁ జనుచు సీతను గావుమం డనుచు నెన్నివిధములఁ జెప్పినను వినవైతివి కదా. కీరములేని పంజరమును బోలి యీపర్ణశాల యెంతగఁ జిన్నవోయియున్నదో చూచితివా!

సీ. విడనాడలేనంచు । వెంటనంటినసీతఁ
గాపాడఁజాలని । కఠినుఁడయ్యె
పతియె దైవంబంచుఁ । బాయనోపనిసాధ్వి
గష్టముల కర్పించి । దుష్టుఁడయ్యె
నాథునితోడిదే । నాతికి సుఖమను
జీవితేశ్వరి వీడి । చెనటియయ్యె
వనవాసమే యెంతొ । వాసయోగ్యమనెడు
కాంతను విడనాడి । కఠినుఁ డయ్యె
రాముఁ డేలనుజీవింప । రమణిలేక
యసువులను బాయుటొప్పగు । నక్కటకట!
సీతవిడనాడి యసువులఁ । జేరఁ బురిని
సాధ్యమానాకు లక్ష్మణా! । చనక నింక.

లక్ష్మ—అన్నయ్యా! మీరలె యిట్లు దుఃఖాకులచిత్తులైన నింకేమి తెరువు? శాంతి మూనుఁడు.

రాము—అయ్యో! ఇంకెక్కడి శాంతము!

గీ. ప్రాణసమురాలు సుగుణాత్మ । భవ్యచరిత
కష్టసుఖము లెఱుంగని । కలికిమిన్న
నామభాగ్యరాశియు సీత । నాదుచెంత
లేక జీవించు టెట్టులే । శాకిఁగుము.

కటకటా ! నాయీజీవము లింకను బాసిపోకున్న వే. ఏ నెట్లు నాయర్థాంగిని, నాయదృష్టదేవతను, నాప్రాణసమానురాలను, నా సీతను గాంచఁగల్గుదును. నా కింకేమిదిక్కు? లక్ష్మణా! సీతయే యిందు లేదా? నాభాగ్యమంతయు నశించెనా? రాముఁ డీయిల నిఁక నిరర్థకుఁడేనా? అయ్యో ! ఏ నెంతపాపాత్ముఁడ నైతిని. నాయీకన్ను లిక సీతను గాంచలేవా? నాభాగ్య మంతయుం దెనా? నా మొఱలు వినువారే లేరా? నాయీతావ మడంచు పుణ్యాత్ము లెవ్వరును గానరాకున్నారు కదా ! అక్కటా ! ఏ నింకెందుఁ జొత్తును? ఎవ్వరితో మొఱలిడుదును. నా కాంతయే లేక నా కీబ్రదు కేల ?

ఓ ! జీవములారా ! నన్నుఁ బాసిపొండు. ఓ మృత్యుదేవతా ! నాయండఁ జేరరమ్ము. భూమ్యాకాశంబులారా! నన్ను మ్రింగివేయుఁడు.

(7 వ అనుబంధము)

హా ! జానకీ !

ఉ. చిన్నతనంబుఁ జూడ కిటు । చేరి యెఱుంగవు కాననంబులన్
ఎన్నవు కష్టసౌఖ్యముల । నింతిరొ నాథుఁడు నాథుఁడంచు నీ
కన్నను వేఱులేదనుచు । కాననసీమల కేఁగుదెంచితే
మన్నన సేయలేని నను । మానిని యేటికి వెంటనంటితో
కన్నులగాంచు భాగ్య మిఁకఁ । గల్గునో కల్గదో యెట్టులోర్తునో.

ప్రాణేశ్వరీ ! ఏ దుష్టులు నిన్నుఁ జెఱఁబట్టి కొంపోయిరో కదా. నిన్నుఁ జూడక యెట్లు మనియుండనోపుదును? క్షణకాలమైన నిన్నుఁ బాయఁజాలనని పల్కిన పల్కులు నేఁడెట్లు నీకు మఱపువకు వచ్చెను. కలనైనను, నేను నీ చెంగట నున్న వేళను గూడ "నాథా! నాథా" యనుచుఁ బలవరించెడుదానవే ! నేఁ డెట్లు విడనాడియుండనోపితివి? ఎన్నివిధముల వలదన్నను, కురంగమును

బట్టియుంచవలెనే కాని, సంతృప్తి నొందలేవని తలఁచితి. ఏయుపము
లనుభవించుటకే కాఁజాలుదును. ఏరక్కసులచేఁ జిక్కి సొక్కు
చుంటివో! ఏనాంతకాల మీవియోగానలంబునఁ బడి మ్రగ్గుచు
సహింప నోపుదును ? నీవు కానరాకున్న నాకీలోకమేల ?
రాజ్యభోగములేల ? సౌఖ్యములేల ?

సీ. ప్రాణంబు వోయిన । భరియింతునే కాని
పతిబాయ నంచును । బలుకలేదె ?
ఉగ్రాటవులఁ జేర । నోర్వఁజాలుదు కాని
సౌధంబు లేలంచు । చనగలేదె ?
కటికు నేలలనుండి । కడపఁగలను కాని
వలదంచు సౌఖ్యముల్ । పలుకలేదె ?
సేవకు లేలను । చేరి సేవింతును
వెంటవచ్చెదనంచు । వెడలలేదె ?

గీ. అట్టి సద్బుద్ధి నేఁడెట్లు । యంతరించె
ఈ వియోగానలంబున । నెట్లు కుంద
దాపునను జేరకుంటివి । తగునె నీకు
ఎటులసైతును దుఃఖార్తి । నేమిసేతు ?

! చిన్నప్పటను నిజపితృగృహమున నెట్టి సుఖము లందియుంటివో
కాని, యీ దారిద్ర్యమున, రాముఁడు జేపట్టి పడరాని యిడుము
లఁ బడుచుంటివి కదా! నన్నుఁ గూడి యుండుటచే నింతదనుక నీ
వనములఁ జరించుచు, కందమూల ఫలంబులే యాహారముగఁ
గైకొని కాలమును బుచ్చుచున్నను, నించుకయు శ్రమయని
తోఁచుటలేదు. ప్రేయసీ! పదునాల్గు వత్సరము లెట్లుగో గడపి
తిరుగఁ బురికిఁ బోయిన, తల్లులాది సకల బంధు
జనంబులును నాదరిఁ జేరి, 'సీత యెచ్చట' యని యడిగిన

నేమని ప్రత్యుత్తర మిచ్చువాఁడ ? అయ్యో ! ఆ కురంగము
నేఁడిటకు రానేల? వచ్చెఁబో నీవు దానిని దెచ్చి యిమ్మని పట్టుఁ
బట్టనేల? ఎన్నివిధముల హితములఁ జెప్పినను విననైతిగా.
లక్ష్మణుని పల్కు లొకింతయుఁ దలపక యే నేల దాని వెంట
నరిగితిని. వీడి రావలదని పలుమాఱు నుడివినను నా యాజ్ఞను గల
నైన మీఱకయుండని లక్ష్మణుఁ డేల నీ నిష్ఠురోక్తులకు మనసు
చెడి నిన్ను విడనాడి నాకడ కేఁగుదెంచె ?

గీ. తొల్లి నేఁ జేసి యున్నట్టి । దుష్కృతంబు
యిన్నిటికిని మూల మగుచు । నిన్నుఁ బాపి
సంత సందంగఁ జేసె నే । నింతి వదలి
పరఁగు కెట్టులోఁ బోవుదు । భగవదాజ్ఞ.

హా ! సతీతిలకమా ! ఇఁక నీ జన్మమున నిన్నుఁ గాంచుటయే కల్లయ
గును గాఁబోలును, అయ్యో! ఎటుల సైతును ?

లక్ష్మ—సోదరా ! ధీరచరితులయ్యు నిట్లధైర్యముఁ బూని వర్తించిన
నెవ్వ రడ్డుపడువారలు.

ఉ. ఎవ్వఁడో దుష్టరక్కసుఁడు । యీవిధి సీతను గొంచుఁ బోయె వాఁ
డెవ్వఁడో వేగమే యరసి । యీర్ష్యను బూనియు గీటడంచియుఁగా
అవ్వల సీతఁ గాంచుటయు । వారయ క్షత్రియధర్మమౌ కదా
యివ్విధిఁ జింతలందుచును । నెంతగఁ బుచ్చిన నేమి లాభమా.

కాన, సీతజాడ లరయుటయే యిందు కర్తవ్యము. ఇట్లొంతకాల మీ
రీతిని గుందుచున్నను నిష్ఫలమే కదా. సర్వ మెఱింగిన మీరలే
యిట్లు దుఃఖించుచుండిన నెవ్వ రెనరాడువారలు.

రాము—తమ్ముఁడా !

ఉ. జాడలు తీయ నెట్లగును । జానకిఁ గాంచెడు భాగ్య మున్న నీ
వేడను నిష్ఠురోక్తులకు । వీనుల నిచ్చియు నోర్వఁజాలకే

వీడుటదేల జానకిని । వెజ్జిననం బగు యత్నమేల నే
జూడగఁజాల సీత నిఁక । సోదర! మృత్యువె తథ్య మిత్తరిన్.

గీ. భూమిజను బాసి యేరీతిఁ । బురికి వెడల
నగును లక్ష్మణా! నేనిందె । యవని పుత్రి
మదిని దలఁచుచు సతతము । మసలుచుందు
మరలి పొమ్మింక నీవును । మానకిప్డు.

లక్ష్మ— (తనలో) అయ్యో! రానురా నీమహాత్ముఁడు, దుఃఖమతిశయించుచు, మతి చలించిన వానిభంగి యధైర్య చిత్తుఁ డగుచున్నాడు. హా! దైవమా! ఏమి తెలుపు? ఎట్టితని ధైర్యసంపన్ను నిగఁ జేయువాఁడ? (ప్రకాశముగా) అన్నయ్యా!

గీ. ఆపదలు కల్గుచుండుట । యవలఁ బాయ
సహజ మగు మానవులకును । సారసాక్ష
కష్టసుఖముల రెంటిని । గానకున్న
భువి యెవ్వ నిమ్మలం బగుఁ గాదె । భూమిపాల.

తామే యిట్లుధర్మములకుఁ బాలువడిన మిమ్మే యుదాహరణగఁ గైకొని, యిఁక లోకులెల్లరు కష్టము లొదవిన "వాఁడు శ్రీరాముఁడే తప్పించుకొనఁజాలని వేళ మనమా వీడుట" యని యధైర్యముఁ బూని యాధాతాజ్ఞకే దూరులగుదురు. మీకు హితములు బోధింప నేనెంతవాఁడను? మీ రెఱుఁగని ధర్మము లెందైనఁ గలవా? సీత మహాపతివ్రతాశిరోమణి. ఆమెను జెఱఁగొని పోయిన దుష్టులు చేటునందుదురనుట నిస్సంశయము. ఇంతియే గాక దుష్టసంహారమే కర్తవ్యమని మీ రెన్నిమారులు నొక్కి వక్కి యుండలేదు. ఆపల్కులన్నియు మఱచి నేఁ డిట్లు విరాగుల గుట న్యాయమా? నీవాగ్రహించిన నీకెదు త్రిలోకంబున వేఱొక్కరుకలరా? నీవేతలఁచిన మల్లోకంబులు భస్మంబు

కాకుండునా? ఇప్పుడు సీతాన్వేషణ మేలేక యూరకున్న, రాముఁ డసమర్థుఁడై పరులు తన ధర్మపత్నిని గొనిపోయినను, విడిపింపఁ జాలకుండెనని యపవాదులపాలొనర్పరా? అప్పటి చింత యింతకు వేయిమడుంగు లెక్కుడు కాకుండునా? కావున సహజమైన ధైర్యావలంబికులై కర్తవ్యకార్యమునకు గడంగుఁడు. సీత నొకింతయు భీతిలేక, దుష్టసంహారకుఁడగు శ్రీరాముని భుజపరాక్రమమును మఱచి, కొంపోయిన యాతుచ్ఛుఁ డెవఁడో తెలిసి కొనుటయే ముఖ్యము.

(8 వ అనుబంధము)

రాము—(క్రోధమూని) ఓరీ! యధమాధమా! మేము దరిలేనివేళ నిటుఁజేరి, చోరునిభంగి సీతనుగొనిపోయిన నీవెవ్వఁడవురా?

ఉ. ఎందుఁ గడాగఁ జూచెదవొ ! యెవ్వరిఁ జేయుదొ కావుమంచు నీ వెందుననున్న మానసిక ! పీకకనుమ్మిక దుర్మదాంధ నీ యంధత మాన్పఁజాలుదును ! నాపగశక్యము ధాత్రికైన నో పంద యిదేమియాగడము ! భారము సైపఁగఁజాలుద యికన్.

లక్ష్మణా, ఆదురాత్ముం డెవ్వఁడో యెట్లు తెలియునగును?

లక్ష్మ—శ్రీరామచంద్రా! మొదట సీత యీప్రాంతములం దెచ్చట నైన నుండెనేమో యరయుదము రండు.

రాము—అయ్యో! నీకింక నిట్టి సంశయము లేల? తా నొంటరిగఁ బర్ణశాలను వీడి చరింపఁ జాల్పదునా? అయినను నీయిష్టానుసారము దానిఁ దీయుము.

(అని యిరువురును నిష్క్రమింతురు.)

(తెర పడును.)



[తెరలో]

లక్ష్మ—సోదరా! అదిగో! అటుచూడుడు. ఎవ్వఁడో రక్కసునివలె నున్నాఁడు. మనలవంచించిన దురాత్ముఁ డాతఁడేయగును. ఏమియు నెఱుంగనివానిచందంబునఁ బడియున్నవాఁడు.

(క్రోధముతో)

గీ. పోయి వధియించువాఁడ నే । పుడమిపాల
యాజ్ఞ నొసఁగుఁడు తడవేల? । యాదురాత్ము
బట్టి దునుమాడకుండుట । పాడియగునె?
కాలయాపన మింకేల । కమలనేత్ర!

రాము—సోదరా! ఆతఁడు రక్కసునివలెఁ దోఁచుటలేదు. నిక్కముఁ దెలిసికొనకుండ వధించుట పాడియగునా? పోయి నిజవృత్తాంత మరయుదము రమ్ము.

[తెర యెత్తఁబడును.]

(ఒడలంతయు రక్తమయమై యొకపక్షి యందుఁ బడియుండును.)

[ప్రవేశము:—రామలక్ష్మణులు.]

రాము—లక్ష్మణా! ఈతఁ డెవ్వఁడో యొడలంతయు రక్తము గ్రమ్మ కొనయూపిరితోఁ బడియున్నవాఁడు.

(అని దగ్గరకుఁ బోవుదురు.)

జ—(వారినిగాంచి) ఆర్యా! శ్రీరామచంద్రా! ఇదే నమస్కరించుచున్నాఁడను. నానామము జటాయువందురు. మీజనకుఁడగు దశరథుని చెలికాఁడను. దుష్టాత్ముండగు రావణుఁడు సీతామహాదేవిని, మీరు పర్ణశాలను లేనివేళఁ జూచి, తననివాసంబగు లంకకుఁ గొనిపోవుచుండ, సహింపనోపక, వానితోఁ బోరాడి తుదకాతనిచే నోడింపఁబడి, మృతినొంద సిద్ధముగ

నంటిని. మీకీవార్త నెఱింగించుటకే యింతదనుక మనియుండఁ జాలినాఁడ. రామా! రామా! రామా!

(అని జీవముల వీడును)

రాము— (9 వ అనుబంధము.)

లక్ష్మణా! ఆహా! ఏమి యీతని విశ్వాసము. మనజనకునకుఁ బ్రాణమిత్రుఁడఁట. కాకున్న సీతకొఱ కా లంకాధిపునితోఁ బోరి యిట్లు మరణించునా? ఈ మహాత్ముని ఋణమెన్నటికిని దీర్చుకొనఁ జాలము. పక్షిరాజేంద్రా! క్షణకాలమైన నీతో సంభాషించుభాగ్యముకూడ మాకు లేకపోయెను గదా! సోదరా! ఈతఁడు మనకుఁ బితృసమానుఁడు. కాన, దహనాదిక్రియలాచరించి మఱియు సీతను వెదకుటకై తరలుదము.

లక్ష్మ—చిత్తము. (అని యిరువురు నామృతకళేబరమును దహనమొనరింపఁ గొనిపోవుదురు.)

(తెర పడును.)



రెండవ రంగము.

ఋష్యమూకపర్వతము.

[సుగ్రీవుఁడు హనుమంతుడాదిమంత్రివర్గముతోఁ గూర్చుండియుండును.]

సుగ్రీవుఁడు— (10 వ అనుబంధము.)

హనుమంతా! నా కీయిడుమ లెన్నటికిని దీఱునవి కావు. ఏపాప మెఱుంగని నన్నిట్లకారణముగ నానావిధముల శిక్షించి పాఱఁద్రోలిన యీదురాత్మున కెన్నటికైన సంతసము కల్గునా? నాకు సోదరుఁడే లేకున్న, రాజ్యమాదిభోగంబు లేలయని తొలున్నివిధముల వలదన్నను, మీరెల్ల రొడంబడరైతిరి

కదా! తుదకు నా సతినిఁగూడ విడనాడి దుఃఖింపవలసినవాఁడ
నైతిని. కటకటా! ఈకడగండ్లెన్నటికైనను బాయునా?

గీ. రాజ్యభారంబు నాకేల? రమణితోడ
నిలువనిచ్చిన జాలును; నీతిమాలి
దండనల్ సేయఁబాల్పడె; ధాత్రి నింక
తెరువు కలదొక్కొ! యదియేమొ? తేటపడదు.

తుద కీఋష్యమూకమే నాకు శరణమయ్యె. శాపవశంబున నా వా
లిటకు రా నశక్యమయ్యెనుగాని, లేకున్న నే నీసరికీయిహ
లోకమునే వీడియుందునుగదా!

హను—ఆర్యా! కష్టము లెల్లవేళలఁ గాపురముండునా? న్యాయా
న్యాయవివక్షతల నరసి దుష్టశిక్షణయు, శిష్టరక్షణయుఁ దక్షకుఁ
బ్రాధాన్యమని తలపోయు భగవానుఁడే మనకు దిక్కు. కాల
మాసన్నమగునందాక, యెవ్వరును వంచింపఁజాలరు. దుర్మార్గు
లెం దెవ్వరు బాగుపడిరి?

సుగ్రీ—(వణకుచు) హనుమంతా! అవచ్చువారెవ్వరో కాంచుము.
వాలిచేఁ బంపఁబడి మనల సంహరింప వచ్చుచున్నవారేమో
యని నామదిఁ భీతి జనించినది. అయ్యో! ఆహా పాత్ముఁడు మనమి
ట్లు దూరమున వసించుచు కందమూలంబుల భక్షించుచుఁగాల
మును బుచ్చుటకుఁ గూడ సహింపఁజాలకుండెఁగాఁబోలును. ఆ
దైవమా! ఇంకేమి తెరువు? నేఁటితో నాకంతము సంభవింప
నుండెనా? కటకటా! ఎవ్వరిశరణుఁజొచ్చువాఁడ? ఎవ్వరు నాకు
దిక్కగుదురు?

సుగ్రీ—వానరేశ్వరా! వారిముఖవిలాసములఁ బరీక్షింప సుక్షత్రియ
కులమం దుదయించిన మహానుభావులని తోచుచున్నయది. ఏక
లంబులనో, నారచీరలుకట్టి, మౌనివృత్తి నరణ్యంబుల సంచరిం

చుచున్నవారు. అంతియేకాని, మన కుగ్రోనర్పనెంచి వచ్చిన శాత్రివులుకారు. వీరింతకుమున్ను పొందిన శత్రువులచే నిట్లుభీతి నందుచుండిరి. శాంతించుడు ఏనేగి వారి నిజవృత్తాంత మరసి వచ్చెదను.

సుగ్రీ—పోయి త్వరితముగరమ్ము.

హను—చిత్తము. (అని నిష్క్రమించును)

(తెర పడును)

[ప్రవేశము:—రామలక్ష్మణులు.]

రాము—సోదరా! ఋష్యమూకాద్రి యదియేకాఁబోలును. ఇప్పుడు మన మందుఁజొచ్చి, యెట్లాసుగ్రీవుని సఖ్య మొనరింపఁగలము. ఒకవేళ నాతనికడకేఁగిన మన్నించునో, మన్నింపకుండునో?

లక్ష్మ—ఆర్యా! ఆతఁడును తనసోదరుఁడగువాలిచే దఱుమఁబడి, తెరువెద్దియును లేక, యిందున్నవాఁడని వింటిమికదా!

రాము—ఎట్టియిక్కట్టు లనుభవించినను దిరుగ సీతనుగాంచిన నంతియేచాలును.

లక్ష్మ—అదిగో! హనుమఁ డెవ్వఁడో యిందుండి మనదెస కరుదెంచుచున్నవాఁడు ఇదియును గొంతశుభసూచకమే.

[ప్రవేశము:—హనుమంతుఁడు]

హను—(తనలో) ఆహా! ఏమిది? వీరిముఖావలోకనంబున నాయొడలుప్పొంగుచు, సంతస మతిశయించుచున్నది. ఇందులకుఁ గతం బేమైయుండును? వీరినిజూడ అవతారపురుషులని తోఁచుచున్నది (శ్రీరామునిజూచి) ఈ మహానుభావుఁడు నిక్కముగ విష్ణువంశాసంభూతుఁడుకాని, వేఱొక్కఁడుకాఁడు. కాకున్న సామాన్యపుమానవున కిట్టి తేజోవిలాసములుండునా? తినఁబోవుచు రుచిఁగోరనేల? పోయి సంశయమును నివృత్తిచేసికొనెదనుగాక.

(సమీపించి) మహాత్ములారా ! నమస్కారము.

రా॥ ల—శుభ మొదవుగాక!

ల—ఓయీ ! నీవెవ్వరవు?

హను—అయ్యా ! ఏను హనుమంతుఁడనువాఁడ; సుగ్రీవునిమంత్రిని; సఖుఁడను. మిమ్ములఁగాంచి, కారణాంతరములచే భీతిలి, మీరా తనిసోదరుండును, శాత్రవుఁడు నగువాలిచేఁ బనుపఁబడినవారలని యెంచి, తెలిసికొనిరమ్మని నన్నిటకుఁ బుత్తెంచె.

ల—గీ. దశరథుని పుత్త్రులము మేము ॥ ధరణిజాత
సీత నరయంగ వెడలియుఁ ॥ జేరి యిచట
వచ్చుచున్నాము సుగ్రీవు ॥ వార్త నెఱిఁగి
సఖ్య మొనరింప నతనితో ॥ సత్యమిదియు.

మేము రామలక్ష్మణులనఁబరఁగుదుము. జనకునియాజ్ఞానుసార మీవనులం జేరి కాలము నుబుచ్చుచుండ, నెవ్వఁడో దుష్టుఁడు ఈమహాను భావుని ధర్మపత్నియగుసీతాదేవిని నపహరించెను. తత్కారణ మునని ట్లున్నాముల కెవఁడి మతిచలించి సంచరించుచుఁ . దుదకు సుగ్రీవునివలనఁ దగిన సాహాయ్య మొదవు నని యెడు హేతువుచే వానిని దర్శింప నేతెంచితిమే కాని, వాలిచేఁ బనుపఁబడిన శాత్రవులము కాము.

రాము—హనుమంతా! నీవు ముందుగఁ బోయి మావార్త మీప్రభువుల కెఱింగించి భీతి నెడఁబాపుము. మేము ను నీవెంటనే వచ్చెదము.

హను—మహాప్రసాదము. (అని హనుమంతుఁడు నిష్క్రమించును.)

రా—లక్ష్మణా! తడవేల? మనమును సుగ్రీవునిజేరఁబోవుదము రమ్ము.

లక్ష్మ—చిత్తము. (అనియిరువురును నిష్క్రమింతురు)

(తెర పడును.)

మూడవరంగము:—ఋష్యమూకపర్వతము.

[సుగ్రీవుఁడాది వానరులు కూర్చుండి యుందురు]

సుగ్రీ—హనుమంతా! ఇప్పటికికదా నా మనము కుదురుపడినది.

ఉ. భీతిజనించె శాత్రవుల । పేరుఁ దలంచిన మంత్రిపుంగవా
పాతకమూన వారి నటు । వాలికి మిత్రులటంచుఁ బల్కుటల్
నీతియె లేనివారమని । నీరజనేత్రుఁడు శంతమూనునో
సీతను దెచ్చియిచ్చుటయొ । జేరియు వాతని గొల్చు టొప్పగుఁగా.

హను—ఆ మహానుభావుఁడు సాక్షాద్విష్ణ్వవతారమే కాని, వేఱొండు కాదు. ఆతనితో మీ సోదరుఁడగు వాలికిని, మీకును గల విరోధకారణ మంతయు వెలిఁబుచ్చితిని. దుర్మార్గవర్తనుం డగు వాలిని సంహరించి, మిమ్మునే కిష్కింధాపురమున కధిపతిగఁ జేయువాఁడనని ప్రతినఁబూనెను. ఆతని కసాధ్యమగునది యీయిల నెద్దియుఁ గానరాదు.

సుగ్రీ—ఎంతయు ధన్యుఁడను.

హను—అరుగో! రామలక్ష్మణు లరుదెంచుచున్నవారలు ఎదురేగి తోడ్కొని వత్తమురండు. (అని ముందున కేఁగుదురు)

సుగ్రీ—(చేతులు జోడించి) దేవాది దేవా!

గీ. అవతరించియు నీయిల । యవనిభార
మంత మొందింప నెంచిన । యాదిదేవ
నీదు మహిమంబుఁ గననౌన । నీరజాక్ష
శరణు కావుము పరమేశ । శరణు శరణు.

మహాత్మా! తొలుత మిమ్ము దవ్వులఁగాంచి శాత్రవులని తలఁచితిని. నా పూర్వపుణ్యవశంబున యవతారపురుషుఁడవై దర్శన మొసంగితివి. శ్రీరామచంద్రా! రఘువంశోద్ధారకా! నా వృత్తాంతమంతయు నీ హనుమంతుని వలన వినియేయున్నారు. సీతాన్వేషణమున శక్తివంచన లేక తగు సాహాయ్య మాచరింతును, నన్ని యిడుమలనుండి తప్పించుభారము నీదే స్వామీ.

రాము—వానరపుంగవా! భీతిని వదలి ధైర్యచిత్తుఁడవు కమ్ము.

చ. అమరులువచ్చి యడ్డముగ । నాపగఁజూచిన నీకువాఁడనే
సమరమునందు నిల్వకను । సాగరమందున డాగియున్న నే
క్రమముగ యుద్ధమం దతనిఁ । గారణమంతయు వెల్లడించు మన్
సమయముఁజూచి చాపెదను। సత్యము సత్యముసమ్ము మింతయున్.

సుగ్రీ—ధన్యుఁడనైతిని. ధన్యుఁడనైతిని.

రాము—సుగ్రీవా! పిదప నీ వేమరక సీతాన్వేషణమునఁ గమశ్రద్ధ నూనవలయును సుమా!

సుగ్రీ—మహాత్మా! యింకను సందియమా! జలరాసు లన్నియు నొక్కటిమాఱుగ నింకినను, భూమ్యాకాశంబులు తల్లక్రిందైనను, సూర్యచంద్రులు గతులఁదప్పి చరించినను, నన్నుత మాట వాఁడఁ గాను.

లక్ష్మ—రామచంద్రా! నిష్కారణముగ వాలిని దునుము టధర్మము కాదా?

రాము—సౌమిత్రీ! నీ సంశయమును బాపెదను వినుము.

గీ. వాలి పరసతిలోలుండు । పాపుఁడయ్యె
నైన టొప్పనె దునుమక । క్షత్రియులకు
దుష్టసంహార మొనరించి । శిష్టజనులఁ
గాచుటయె యిందుఁ జూపెడు । కారణంబు.

సుగ్రీ—సత్యము. మహాత్మా! సత్యము.

హను—తండ్రీ! రామచంద్రా!

సీ. ధర్మమంచును నెంచి । తాటకి దునుమాడి
కౌశికుయాగంబు । గాచినావు
భుజవిక్రమముఁ జూపి । భూజాతఁ జేపట్టి
హరువిల్లు క్షణమున । విఱిచినావు

దుష్టరక్కసులను । దునుమునఁ గడపికి
దశరథువాజ్ఞచేఁ । దరలినావు
భక్తి జటాయువు । పార్థివలో సలుపంగ
వాత్సల్యమును జూపి । వరలినావు

గీ. ధర్మ పరిపాలనాశక్తి । ధరణి నిట్లు
యవతరించిన పురుషుఁడ । వయ్య నీవు
అట్టి నినుఁగొల్వఁగల వేమి? । యమలచరిత
రావ రక్షింప సుగ్రీవ । రామచంద్ర.

కారణాంతరములచే నిట్లు మానవుఁడవై, సకలజీవరాసుల మాయా లోకంబున ముంచి, వరలుచున్న దేవదేవుఁడ వీవు కావా? లీలచే నీవిట్లు తరలియుండి లోకములకు నీతులఁ గఱపనెంచి తివే కాని, నీ వేమి! ధర్మపత్నిని గోల్పోవుటయేమి? మేము నీకు సాహాయ్య మాచరించుటయేమి? మే మేనాఁ డాచరించినపుణ్యఫలముచేతనో, నీదర్శనభాగ్యము లభించి తరించితిమి.

గీ. కర్మపురుషుఁడ వంచును । మర్మ మెఱుఁగ
లేక తపియించుచుందురు । లీలఁ దెలిసి
నీదు మహిమంబుఁ గనునట్లు । నీరజాక్ష
సాధ్యమా మెకోటి కేరికి । సదయహృదయ!

లక్ష్మ—సోదరా! తడవేల? సత్వరంబున వాలిని సంహరించి, యీ సుగ్రీవుని పట్టాభిషిక్తునిఁ జేసి, సీతాన్వేషణమునకుఁ గడంగ వలదా?

రామ—సుగ్రీవా! ముందుగ నీవేగి వాలితో సమరమునకుఁ దల పడుము. మేమును నీ వెనువెంటనే వచ్చి, చేయవలసిన కార్యముఁ జేయుదుము.

సుగ్రీ—చిత్తము. (అని నిష్క్రమించును)

(తెర పడును.)



శ్రీ

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము.

## తృతీయాంకము.

కిష్కింధాపురమునకు సమీపము

[వాలి పడియుండ, సుగ్రీవుఁడు, రామలక్ష్మణులు, హనుమంతుఁడాది వానరులు నిలచియుందురు.]

వాలి— రామా! రఘువంశదీపకా!

ఉ. చాటునడాగి యీపగిది । శౌర్యవిహీనతఁ గొట్టఁజెల్లునే
యేటికి క్షత్రియాన్వయము । యేటికి పౌరుషమోయి రాఘవా
సాటి యెవేరు నాకిలను । సాహసమొందను జెప్పనొప్పునే
మాటలు వేయి యేల యిను । మానమ దేటికి భీతికల్గెనా?

నినుఁబోలు సుక్షత్రియకులసంజాతుం డిట్టి నీచప్రవర్తనలు తగునా? నాతోడ యుద్ధమాచరింప నిష్టముగున్నని, యెదురుగవచ్చి రణమాచరింపఁ జాలకపోతివా? ఇప్పుడు నీ ధర్మానువర్తన మేమూలడాగెను? అగును. భార్యను బాసి మతి చెడియున్నవాఁడవు. ఇట్టి సమయమున న్యాయాన్యాయవివక్షత కల్గునా? నీకు సుగ్రీవుఁడు సాహాయ్య మాచరించుననియే కదా? నన్నకారణముగ యధర్మయుద్ధమున వధించితివి ఏమి నీకెట్టి

యపకార మొనర్చియుంటిని ? ఈవార్త నా కెఱింగించినఁ దత్క్షణమే నీమ్రోలవ్రాలి, నీయాజ్ఞను వడసి—

ఉ. రావణు నీడ్చి తెచ్చి రఘు । రామ యిదే శరణార్థిఁ బ్రోవుమా
యీవిధిఁజేయు నన్నుఁ డిఁక । నేలను శాంతినిఁబొందు బల్కుచుం
దావక పాదపద్మములఁ । దద్దయు వ్రాలెడిరీతి జేయ లే
నే వరవీరవంశమునకు । నే దశకంఠుని నొంచు బొంచవే.

కం. నీకును నాకును మును ముం
దేకారణమున నయినను । నిట్టి విరోధం
బో కంజాక్షా! కలదే
యేకారణము ననుజంప । నెంచుట కనఘా.

రాము—వానరేశ్వరా! దుష్టసంహారమే కర్తవ్యమగుటచే నిట్లాచరించితిని. గడచినదానికై చింతిలనేల?

గీ. స్వర్గసుఖము లందంగను । జనెద వీవు
చింతలేలను బాయుము । శీఘ్రగతిని
మనము దైవము కల్పించి । మనలుమింక
కారణం బిట్టులుండెను । గనుము నిజము.

వాలి—మహాత్మా! నీకన్న వేఱుదైవం బెవరు? నీ పాదపద్మములనే స్మరించుచు జీవములఁ బాయువాఁడ అదియే నాకు భక్తిముక్తిప్రదాయకము.

[ తెరలో ]

తార—హా! జీవితేశ్వరా! సుగ్రీవున కీనాఁడు శ్రీరామునకు సాహాయము వచ్చెననియుఁ, బోరు విడువుమనియు నెంతగఁ బ్రార్థించినను వినక, తుదకు రణమునఁ గూలితివా? అయ్యో! రక్తసిక్తమై యుండెను నీ మేనెట్లు చూడఁజాలుదాన?

రాము—(వినుట నభినయించి) హనుమంతా! ఆ యార్తారవమేమి?

హను—ఆర్యా! ఈతని సతియగు తార యిట కరుదెంచుచున్నది.

[తార అంగదునితోఁ బ్రవేశించును.]

(11 వ అనుబంధము.)

తార—హా! నాథా! (యని భర్తపైఁ బడును. కొంతవడికి) అయ్యో! ప్రాణేశ్వరా! జీవములను బాసితివా? మాకిం కేమిదిక్కు? నాథా! నాథా! అయ్యో! పలుక వేమి? ప్రాణేశ్వరా! ఈ చిన్నికుమారు నెవ్వరి పాలొనరించి దివి జేరఁబోతివి? రాముని వలన నీకు నేఁడు దీర్ఘనిద్ర జనించెగా? కటకటా! నన్ను విడి పోవుట న్యాయమా! నీతోడఁ గొనిపొమ్ము. అక్కటా! నీ మోమెంతలోఁ గళావిహీనమై పోయినది. సత్యమును గ్రహింపఁ జాలకపోతివా? శ్రీరాముఁడు నన్నేల యకారణముగ వధించు నని గర్వించితివే క్షత్రియులకు న్యాయాన్యాయములు గావలెనా? శ్రీరాముఁ డసమాన బాహువిక్రమధనుండని తెలిసియు నిట్లాతనితో సమరమునకుఁ దలపడితి రిట్లు మృతి నొందుటకే కాఁబోలును. అయ్యో! నా యీ తాపాగ్ని యెట్లు చల్లారఁగలదు? ఎవరిఁ జొత్తును? రాఘవేంద్రా! అబలుఁడగు సుగ్రీవుని మూలమున నెల్లవేళల నిన్నే భక్తినిఁ గొల్చుచు భజియించు నీతని నకారణముగఁ దునిమితివా? సోదరుల జగడాలయందు నీవేల చేరవలసి వచ్చెను. నీ సతిని గొనివచ్చుటకేయైన, వాలి యందులకు సమర్థుఁడు కాఁడా? మీకు వేయొండు శ్రమలు కలుగకుండగనే యా రావణుని బట్టితెచ్చి నీ పాదపద్మములకు మ్రొక్కఁజేసి యుండునే. రామచంద్రా!

గీ. పతిని బాసినమో కాదయ్య! మతిచలించి
తిరుగుచున్నావు వనములఁ దెరువులేక

కతిని విడవాడి నే నెట్లు । బ్రిదుకుదాన
ధర్మ మేమాయె నిత్తరి । ధరణిపాల.

హను—దేవీ! నీ నాథుఁడు—

గీ. ఆదిమధ్యాంత రహితుఁడై । యలరునట్టి
శ్రీమహావిష్ణు చేతిలోఁ । జిక్కి మడసె
పూర్వపుణ్య ఫల మదెంతో । పొల్పెసగున
చింతలేటికి వీనుము । సంతసించు.

తార—అయ్యో! ఇంకను నాకు సంతసమా! భక్తపరాధీనుండని వన్నెకెక్కిన శ్రీరామమూర్తియే యధర్మములకుఁ బాల్పడిన నింక నితరుల లెక్కింపనేల? హా! కుమారా! తండ్రిలేని యదృష్టహీనుఁడ వైతివా? నిన్నెన్నఁ గాంచి, యారాముఁడు జాలి నందకుండెనా?

అంగ—హా! తండ్రీ! చిన్ననాట నుండియు క్షణకాలమైన వీడక, ప్రేమాతిశయంబుల నన్నుఁ బెంచిన నీ ప్రేమ నేఁ డెట్లు వీడి పోతివి. జనకా! ఒకమాఱు కన్నులఁ దెఱచి నన్ను వీక్షింప వా? ఏను దఱిజేరినంతనే, కౌగిళ్ళను జేర్చి ముద్దుఁగొనెడు వాఁడవే! అయ్యో! నేఁ డెంతగఁ బిల్చినను బలుకకుంటివేమి? ఇఁక నన్ను 'నాయనా! తనయా! రమ్ము' అని పిల్చువా రెవ్వ రు? నా యాటపాటలఁ జూచి మురియువా రెవ్వరు? ఈ పాపాత్మునకు నీయట్టి జనకుఁడు దక్కునా?

రాము—లక్ష్మణా! ఆతని నించుక శాంతిపఱుపుము.

లక్ష్మ—అంగదా! సర్వము నెఱింగిన నీవి ట్లబలలరీతిఁ గుందఁదగునా? కాల మాసన్నమగునెడ నెవ్వ రడ్డుపడువారలు? ధాతాజ్ఞ మీఱ నేరికి వశమగును. జీవు లెల్ల కాల మీయిల శాశ్వతం బుగ నిలువనోపునా? దినమున కెన్నెన్ని జీవరాసులు పుట్టు

[తెర-]

లక్ష్మణుడు—(క్రోధముతో) ఓయీ! సుగ్రీవా!

ఉ. వాలిని సంహరించెఁగద । భారము తీరెను రాజ్యలక్ష్మి నీ
మ్రోలను వాలె రాముఁడిఁక । బోవుట రాజ్యము సంగుటల్ మదిన్
లీలగ నెంచి తేని నవ । లీలగఁ గ్రుంగును రాముఁ డెంచినన్
కాలముఁ దీఱు వేళ నిటు । కానరమబ్బురు వానరేశ్వరా.

అగునగును. నిన్ననననేల? రాజ్యమదాంధతయు, స్త్రీలోలత్వము దావ
రించిన కాలమం దిట్టి దుర్బుద్ధులు జనించును కాఁబోలును.
తొలుత నట్టి వినయవిధేయతలఁ జూపితివో నేఁడు వానికి
వేయిమడుంగు లెక్కుడుగ గర్వాంధతను వెలిఁబుచ్చుచుం
టివి. కానిమ్ము. శ్రీరామచంద్రుని విశితబాణంబుల కెఱయగు
వేళనైన నీ తప్పిదముల గ్రహింపఁ జాలుదువు.

గీ. నిచులకు సౌఖ్యమబ్బిన । నితిమాలి
గర్వ మొదఁదాల్తురంతట । కావరమున
పాలుపోసియుఁ బెంచిన । పాము తనదు
దుష్టబుద్ధిని మానునే । దోసమనుచు.

ఎవరినెట్లు సన్మానింపవలెనో, తెలిసి వర్తింపకున్న, నుపకారుల నుప
కార మొనర్పకుండుటయే కాక, తుద కపకారమును గూడ
నాచరింపఁ బాల్పడుదురు.

సుగ్రీ—(భీతి నభినయించుచు) అనుకొనినట్లే యైనది. హనుమంతా!
అదిగో! లక్ష్మణుఁడు క్రోధపూరితుఁడై నిందించుచు యిటు
వచ్చుచున్నాఁడు. ఏమి సేయువాఁడ?

హను—వానరాధిపా! ఎదురేఁగి కొనివచ్చి శుశ్రూషణ వేఁడుటయే
యుచిత కర్తవ్యము.

సుగ్రీ—ఏమైన వారికే భాగము నడుపుము.

(అని మొకరేగి లక్ష్మణునిఁ దోడ్కొనివత్తురు.)

లక్ష్మ—సుగ్రీవా! నీకు రాజ్యలక్ష్మి చేకూరి యెంతకాలంబైనది.

సుగ్రీ—(తలవంచి యూరకుండును)

లక్ష్మ—శ్రీరాముని వాక్యములను వినుము—

చ. వినయముఁజూపి యాకరణి । వీడగ నెల్లున బానలన్నియున్
తన విఁక శాశ్వతంబనియు । దప్పదు రాజ్యము నిక్కమంచు నీ
మనమున నెంచియుంటివో కా । మానక పంపెద వాలిఁజూడగఁ
దనుపుము నీదు నిశ్చయము । వానర శేఖర సత్వరంబుగా.

గర్వాతిశయమే యింతులకు మూలకారణంబైన నీరాజ్యము నీకుఁ దక్కకుంటయేగాక, జీవములకుఁ గూడ నాశ వదులుకొనుము సుమీ. ఇందుకుఁ బ్రత్యుత్తరమేమి యొసంగెదవు?

సుగ్రీ—(చేతుల జోడించి) కాలయాపనమైన మాట సత్యమే.

గీ. తనయు తప్పుల సైరింప । దలచకుండ
దండ్రియే శిక్ష జేయంగఁ । దలచు నెడ
దెరువు కలదొక్కొ లక్ష్మణా । ధీరమతిని
నిలుపనోపుదువా యిఁక । నిరజాక్షు
డాగ్రహించిన గతియేమి? । యమలచరిత

లక్ష్మ—ఓయీ! ఇప్పటికి రాముఁడు జ్ఞప్తికి వచ్చెను గాఁబోలును. కానిమ్ము ఇఁకనైన రాముదర్శనార్థము బయల్వెడలెదవా?

సుగ్రీ—అయ్యో! యింకను బుద్ధి కలుగకుండునా? ఆ మహానుభావుని దర్శనమే సర్వవిధముల శ్రేయోదాయకమగునెడ, వారిని కార్యముఁ దక్కవలెచ కూరకుండువాఁడనే. ఇప్పుడే బయలు దేఱుదము నడువుఁడు. (అందఱు నిష్క్రమింతురు)

(తెర పడును.)



## మూడవరంగము.

## ఋష్యమూకపర్వతము.

[ప్రవేశము:— రాముఁడు]

రాము—లక్ష్మణుఁ డింకను రాకుండుట కేమి హేతువో కదా. ఆసుగ్రీవున కీమాటయే జ్ఞప్తి లేకుండెనుగాఁబోలును. ఉన్నను తనకార్యములన్నియు నెఱవేఱుటచే సాహాయ్యమాచరింప నిష్టపడకుండెనో? కష్టకాలమున నన్నియు నశుభములే కల్గునుగాని, శుభములొదవునా? మిత్రులే శత్రువులగుదురు. ఒక్కరును మన్నన సేయనోపరు. ఏనాఁడు నాయిల్లాలు నన్నుఁడఁ బాసెనో యంతటి నుండియే, నాభాగ్యభోగ్యము లన్నియు నశించినవి. హా! సీతా సుగుణోపేతా!

గీ. పాపకర్ముఁడ నీ రాముఁడు ౹ పడఁతి నిన్నుఁ
బరుల కర్పించి యరయక ౹ బ్రదికియుండె
ఎటుల నోర్వంగఁ జాలితో ౹ యింతి కడకు
జీవములఁ బాసియుంటివో ౹ బ్రోవననుచు.

అక్కటా! ఏనెంత దుష్కర్ముఁడనో కదా! కానున్నఁ బ్రాణసమానురాలవగు నిన్నుఁడఁ బాసినను, నాయీజీవములు మేనుఁ బాయలేకున్నవి. పాపి చిరాయువనునట్లు పాపాత్ములకు జీవితకాలమభివృద్ధినొందుచుండుననుట యిదియే కాఁబోలును. తన్వీ! భుజబలాన్వితులగు రక్కసుల నెందఱినో నిమిషమాత్రమున వధియింపఁజాలితి నేగాని, నిన్నుఁ గొంపోయిన దుష్టుని దెలిసి రూపుమాపఁజాలనైతిని.

ఉ. అక్కట యెట్టులోర్తు దను ౹ జాంతకుఁ డెవ్వఁడో సీతఁ గొంచుఁ దా
నెక్కడ కేఁగియుండెనొకొ ౹ యింతియుఁ జింతలనెట్లు చిక్కెనో

ఎక్కడిజాన కింకఁ దను । వేటికి విక్రమము శౌర్యహీనుఁడన్
వెక్కసమైనభంగి సతి । పీడినపాపుఁడ దుర్మదాంధుఁడన్.

ఓసాధ్వీ!

చ. కరుణయొకింత లేక నిను । కాననసీమల నొంటిపీడగా
ఉరుతరశోకవహ్నిబడి । యోర్వక నన్నుఁడొ కాచువాఁడనం
చరమర లేక నిల్పితివా? । యార్తిని కాయముఁ బాసియుంటివో
తరుణిని గావలేక యిటు । తథ్యమునిల్చుట శౌర్యహీనుఁడన్.

అయ్యో! కాల మెంతత్వరితముగఁ బోవుచుండెను. పదునాల్గువత్సరము లీయరణ్యావాసమిట్లు సీతనువిడనాడి దుఃఖించుటకే ప్రాప్తించెనుగాఁబోలును నాకీక సంతినసౌఖ్యములు రాఁడును దూరమయ్యె. ఈతాపాగ్నిచేతనే జీవములఁ బాయుట నిక్కము.

(ఆలోచనా నిమగ్నుఁడై)

ఆహా! ఏమినావెఱ్ఱి! ఈత్రిభువనంబుల నాకెదురై, రణమున గెల్వఁజాలువాఁ డెవ్వఁడు. నాప్రాణేశ్వరి, యీలోకంబున నెచ్చట నున్నను దెలిసికొనలేకుందునా? ఆదుర్మదాంధుని, ఆనీచునిఁ బట్టి దునుమలేనా?

[లక్ష్మణుఁడు సుగ్రీవుఁ డాది వానరులు ప్రవేశింతురు.]

సుగ్రీ—రామునిఁగాంచి)

(12 వ అనుబంధము.)

గీ. మూఁడులోకంబులకుజూడ । మూలమీవు
భక్తులను జేరి దయఁజూచు । ప్రభువువీవు
ఆర్తజనరక్షకుండవు । యమలచరిత
శరణు సైరించు శ్రీరామ । శరణు శరణు.

మహాత్మా! శ్రీరామచంద్రా!

ఉ. కాచినవాఁడవీవు నను । కాయము బాయఁగ నున్న వేళ నే
దాచినదాఁగునే కొ మది । తాల్మి సహించితి వింతకాలముఁ
గాచినఁ గావకున్న నిఁకఁ । గానఁగఁజాలుదె వేఱుదిక్కు నే
నీచుఁడనంచు నెంచితివొ । నేరము లెంచక నీరజేక్షణా.

రాము— సుగ్రీవా! లక్ష్మణుఁడు వచ్చునందాఁక, మా విషయమే పెడచెవిని బెట్టితివి కాఁబోలును. గతించినదానికై యోచింప నేల ? ఇఁకనైన సీతాన్వేషణార్థము, శక్తిసామర్థ్యంబుల నలరారు వానరుల నర్దెసలకుఁ బనుపుము.

సుగ్రీ— ఆర్యా! ఇదివఱకే నియమించియుంటిని. ఈ హనుమంతుఁడును, అంగదుఁడాది యీవానరులును మిగిలియున్న వారలు. వీరిని దక్షిణదిశకుఁ బంపనుద్దేశించితిని. ఈ హనుమంతుఁడు ముల్లోకంబుల నెచ్చటనున్నను—

గీ. జానకీదేవి వీక్షించి । జాడ లరసి
వచ్చునంతటి ఘనుఁడగు । పంకజాక్ష
కార్యసాఫల్య మీతఁడే । కనును యనఘ
తప్పదింతయు నిక్కము । ధాత్రిబలుఁడు.

రాము— మంచిది.

హను— (చేతులజోడించి) తండ్రీ! రామచంద్రా! నాయదృష్టవశమున సీతామహాదేవిని గాంచిన. నేను రామదూతనని యెట్లు నమ్మకపుట్టసేతును?

గీ. కపటమంచును నెంచునో । కాంత నన్ను
నమ్మఁ జాలకయుండునో । న్యాయమనుచు
నెట్లు బోధించువాఁడను? । యింతి కనఘ
యానవాలు నొసంగుము । యమలచరిత.

రాము—అయిన దీనిఁ గొనిపొమ్ము.

(అని యుంగరమును దీసి యొసంగును.)

హను—(పుచ్చుకొని) మహాప్రసాదము !

గీ. అనఘు శ్రీరామచంద్రుని । యాజ్ఞఁగొనియుఁ
బోవుచున్నాఁడ సీతను । బొల్చ నిపుడె
భాగ్య మేటులుండెనో కన । భారమగును
రామచంద్రునికరుణచే । రాముఁ గాంతు.

(అని రామునకు నమస్కరించును.)

రాము—శుభమగుఁ గాక! పోయిరమ్ము. నెలదినముల గడువునుమా త్రము మఱవకుండుము. (అంగదుఁడాది వానరులతో హనుమంతుఁడు రామనామస్మరణఁ జేయుచు నిష్క్రమించును )

(తెర పడును.)



నాల్గవరంగము:—సముద్రప్రాంతము.

[ప్రవేశము:—హనుమంతుఁడు, జాంబవంతుఁడు, అంగదుఁ డాదివానరులు.]

హను—అంగదాది ప్రముఖులారా! గడువుదినంబులు కూడ గతించు చున్నవి. ఇంతవఱకును సీతాదేవిజాడ లించుకయుఁ దెలియఁ జాల మైతిమి. తిరుగ నేమోముతో శ్రీరామచంద్రునిఁ జేరఁ జాలుదుము? ఆరాముఁడు మనలఁగాంచి, సీత యెచ్చట నుండె నని యడిగిన నేమని ప్రత్యుత్తర మిచ్చువారము ?

జాంబ—ఆంజనేయా! అగును. సత్యమే. తిరుగవలసిన చోట్లన్నియును దిరిగితిమి. ఎట్టి పడరానియిక్కట్లు బడుచున్నను లెక్కించితి మూ! ఇఁక జరుగవలసిన విధాన మెద్దియో నీవే తెల్పుము.

అంగ—హనుమంతా! మే మందఱమును నీ యభీష్టము ననుసరించి యే వర్తించువారము.

హను—గీ. సీతఁ గనుఁగొనఁజాలక ॥ చేరి రాము
మోముఁ దిలకింప నెట్లగు ॥ మూఁలమరయ
జీవములఁ బాయు టొప్పగు ॥ బోవఁజాల
రామనామంబుఁ దలఁచుచు ॥ బాము లేల?

అంగ—అంజనీసుతా! మేమును నిన్ననుసరించుటయే కర్తవ్యము.

(ఒకప్రక్క సంపాతి పడియుండి)

సంపా—వీరలెవ్వరో! శ్రీరాముఁడు, సీత అనుచున్నారు. సీతాన్వేషణార్థ మరుదెంచిన రామదూతలు కారుకదా! అట్లైనచో నా భాగ్యమేమనవచ్చును ఇచ్చోట నేయుండి వీరివృత్తాంతమంతయు నరసెదనుగాక!

అంగ—హనుమంతా! ఆ శ్రీరాముని వృత్తాంతము నొక్కమారు పూర్తిగ వినిపింపుము. పిదప నీసముద్రముఁబడి జీవములఁబాయుదము. అవసానకాలమున మన కంతకన్న మోక్షదాయక మగువ దింకేమికలదు?

జాంబ—అంజనేయా! అట్లొనర్పుము.

హను—గీ. దశరథుండను నొప్పెడు ॥ ధరణిపాలుఁ
డుండె పుత్రులు లేక నా ॥ యుర్వినాథుఁ
డెన్ని యాపూజ్యులొనరింప ॥ నెన్నఁ గడకు
సుతులునల్వురు పుట్టిరి ॥ యతని కంత.

అందు మొదటివాఁడు శ్రీరామచంద్రుఁడే—ఆ శ్రీమహావిష్ణువే—

సీ. తలఁచి భూభారంబుఁ ॥ దప్పింపఁగా నిట్లు
అవతరించెను రాముఁ ॥ డనగ భువిని

చిన్నవాఁడన తాను । చేరియు నడవుల
దుష్టరక్కసులను । దునిమె నతఁడు
పాషాణమైయున్న । పడఁతి నాతిని జేసి
గౌతము కర్పించె । కరుణఁజూపి
జనకునింటికిఁ దాను । చనుదెంచి వింటిని
విఱిచి భూజాతను । పెండ్లియాడె

గీ. తండ్రిపంపున వనమునకుఁ । దరలె నిట్లు
సీత, లక్ష్మణుఁ గూడియుఁ । జెప్పవశమె
అతనిమహిమంబు వాలిని । హతమొనర్చె ;
ఇదియె శ్రీరాము చరితంబు । నెన్నతరమె?

సం—మహాత్ములారా! మీవలన శ్రీరామునికథ వింటిని, శాపమునుండి తొలఁగి యెప్పటివలె ఱెక్కలను గల్గి సుఖమందినాను. నానామము సంపాతియందురు. సీతామహాదేవిని రావణుఁడు కొంపోవుటను గనులారఁ గాంచియు, శక్తిచాలక యూరకున్నాను. ఇప్పుడాపె లంకయందే యున్నది. నేను జటాయువునకు సోదరుఁడను, ముదుసలినగుటచే లంకకుఁ బోఁజాలను.

హను—పక్షీంద్రా! సీతావృత్తాంతముఁ దెలిపి మాప్రాణములఁగాచి నందులకు మేమెంతయు నీకుఁ గృతజ్ఞులము.

అంగ—ఇందుఁ గొన్ని శుభసూచకములే కనవచ్చుచున్నవి. కాని, శతయోజనంబులు పరిమితిగల యీయంబుధిదాఁటి, లంకను జేరువారెవ్వరు?

(అందఱు నిశ్చేష్టులై నిలువఁబడుదురు.)

జాంబ—ఏనెన్నియోమాఱులు సునాయాసముగఁ బోయియుంటిని కాని యిప్పుడు ముదుసలినగుటచే నేను పదియోజనంబులకంటె నెక్కుడు లఘింపజాలను. అంజనీసుతా! హనుమంతా! నీశక్తిని

నీవెఱుంగవు. నీవు బాల్యమందు రవిని జేరి విద్య నభ్యసించిన మహానుభావుఁడవు. నీవు తలంచిన నట్టి శతయోజనములు వెక్కంటిని దాఁటఁగల్గుదువు. శ్రీరాముఁడు నీశక్తి సామర్థ్యంబుల నెఱింగియే, ముద్రిక హానవాలుగ నీకొసంగెను. నీవు తక్క నితరులాలంకను జొచ్చుటయు, సీతజాడ లఱసివచ్చుటయుంగల్ల. ఇందులకు నీవే సమర్థుఁడవు. నీవు తిరిగి వచ్చునందాక మేమిచే కాచియుండెదము.

అంగ—హనుమంతా! ఇఁకను గాలయాపనమేల? సత్వరంబుగ బయలుదేఱుము.

హను—అయిన నిఁక సందియమెంగాలకు? ఆశ్రీరామచంద్రుని కరుణయే యున్నతఱి సర్వార్థసిద్ధిని బడయకుందునా? పోయి వచ్చెదను.

అందఱు—శుభమగుఁగాక.

(రామస్మరణఁజేయుచు హనుమంతుఁడు. నిష్క్రమించును.)

(తెరపడును.)





శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము.



## చతుర్థాంకము.



లంకాపురవీధి.

[ప్రవేశము:— హనుమంతుఁడు]

హను— అయ్యో! ఈలంకాపురమంతయు నిల్లిల్లు వెదకుచుఁ జుట్టివచ్చితి కాని నాపాపమేమియో—

సీతను గాంచనైతి నిఁకఁ । జేయునదేమియొ తోఁచ దక్కటా
పాతకమంచు నెంచక నా । భామను రక్కసు లేమిచేసిరో
భీతిలి రాముఁ జేరనని । పీడను జీవము లార్తి సొక్కుచున్
హా! తరుణీలలామవడి । వారయఁ జాలుదు నంచు నెంచితిన్.

అటకటా! ఇంకేమి సేయుదును?

సీ. శ్రీరామచంద్రుండు । సీత యేమని నన్నుఁ
బ్రత్యుత్తరం బేమి । పల్కువాఁడ?
ముద్రికఁ జేమిత్తో । ముదిత గైకొననేమొ
తెల్పుమనఁగ నేమి । తెల్పువాఁడ?
సుగ్రీవుఁ డరుదెంచి । సువతి యెందుండెనో
చెప్పుమనఁగ నేమి । చెప్పువాఁడ

సావిత్రి నమ్మజాలది । సాధ్వికిఁ గుశలంబె
మఱువ్రమా యన నేమి । మఱువువాఁడ?

గీ. కడకు సంతసమంత్రయు । గడచిపోయె
జానకీదేవిఁ గాంచక । స్వామిరాము
చంద్రవదన మేరితిని । సాహసించి
చూడఁజాలుదు నేనింక । సొబగుదక్క.

హా! పతివ్రతాతిలకమా! సీతా! ఎందైన జీవములతో నుంటివో, లేక యీదుష్టరక్కసుఁడు రావణుఁ డాఁకుపల్కులకునోడి, విగతజీవివై తివోకదా తల్లీ! నీ క్షేమసమాచారములరసి, నీవృత్తాంత మాశ్రీరామున కెఱింగించి, సంతసింపఁజేసెదు మహాభాగ్య మెదవునని యెంచియుంటినే కాని, యిట్లు నిరర్థకుఁడ నగుదునని తలఁపోయలేదు కదా. జననీ! నినుఁబోలు సాధ్వీమతల్లులు కిట్టిపాట్లు జనింప లోకములెల్లు భస్మీభూతములు కాకుండ నిలువఁజాలెనో? ఆదశకంఠుని శిరము లొక్కమాయుగ సీతాపాగ్నిచే నేల దహింపఁబడకుండెనో? అక్కటా! ఇఁక నేనింక సీతామహాదేవిని, ఆదిలక్ష్మినిఁ గాంచఁజాలనా? ఎన్నిశ్రమలకోర్చి తుదకింతఁ జేరితిని, నదియు నిష్ఫలంబయ్యెనే, ఇఁకఁ గర్తవ్యమేమి? (ఆలోచన నభినయించి) ఆలోచన కేమున్నది? ఏవిధంబున సీత జాడఁ దెరియక, రాముని జేరఁబోతినా! తత్క్షణమే యామహానుభావుఁడు మేను బాయుట నిశ్చయము. వాని వెనువెంటనే లక్ష్మణుఁడును మృతినొందును. అదంతయుఁగాంచి సుగ్రీవాదులు జీవములవీడుదురు. రామలక్ష్మణుల వృత్తాంతము తెలిసినతోడనే భరతుఁడాది శ్రీరాముని బంధుమిత్రాదులందఱును విగతప్రాణులగుదురు. వారందఱి మృతికిని గారణభూతుండ నేనే యగుదును. అట్టి మహాపాతకమున కొడంబడుటకన్న నేనిందే మునుగ

నసువుల నీను టుచితము? హా! విధాతా! ఎంతనుప్పుడు ఘటిల్ల జేసితివి? నాశక్తి సామర్థ్యము లన్నియుఁ గూడ కీరితిని ప్రాణత్యాగమునకుఁ గారణభూతములయ్యెనా? రాముని యెడ నాకుఁ గలభక్తియంతయుఁ గూడ కీట్టివార్తను దెల్పుటకు వినియోగించెనా? ఏనిప్పు డేరీతిని బ్రాణములఁ ద్యజించువాఁడ? (అని నలువంకలఁజూచి) అదిగో! ఏదియో యుద్యానవనమువలెఁ దోచుచున్నది. అందునఁగూడఁ దిలకించి, పిమ్మటఁ జేయువలసిన పనులఁ బూర్తిచేసెదను.

(అని నిష్క్రమించును.)

(తెరపడును.)



రెండవరంగము.

అశోకవనము.

[చుట్టును రాక్షసస్త్రీలు కావలియుండ సీత యొకవృక్షచ్ఛాయను గూర్చుండి యుండును ]

13 అనుబంధము.

సీత—(దుఃఖముతో) హా! రామా! రామా! ఇఁక నాకెవ్వండి ముక్తి లేదా? నీముఖారవిందమును దిరుగ నీక్షించుట కూడ భాగ్యము నశించెనా? అయ్యో! నాథా! అతి నిర్భాగ్యురాలను నేను. నాకు నమ్మాయయని నీవెన్నివిధముల బోధించినను వినక, తత్ఫలమిప్పు డనుభవించుచుంటిని. ప్రాణేశ్వరా! క్షణకాలమైన మీముద్దుమోమును దిలకించక యుండజాలక పోవుటచేఁ గదా, వలదన్నను వనమునకు వెంటనంటివచ్చితిని. ఏనెంతటి పాపాత్మురాల నగుటచేనో యట్టిభాగ్యముకూడ నశిం

చెను. కటకటా! యెట్టి ఘోరము? నాయీదుఃఖమున కంతమెన్నఁ
టికైన కల్గునా? ఈకష్టాత్ముఁ డెన్నటికైన మరణించునా?
లక్ష్మణా! నీపల్కులయందలి యర్థ మొకింతయుఁ దెలియక,
యెట్టిదుర్భాషలాడి నీమనమును నొవ్వఁజేసితిని? సన్మార్గు
దూషించిన ఫలితమే యిదియని యిప్పటికిఁ దెలిసికొంటిని.
రామా! కరుణాపారీణా!

ఉ. ఏవిధి రావణాధముని । నెన్నఁడుబట్టి వధించువాఁడవో
ఏవిధి దుఃఖమార్పగను । నెంచియు నీవిధిఁ జాగుఁ జేసితో
బ్రోవఁగఁదల్పకున్న నిఁకఁ । బ్రోచెదు వారెవరయ్య నాథ యో
పావనమూర్తి భక్తజన । ప్రార్థన లెంచుము రిత్తవోవునే.

నాథా!

గీ. జాలమున కోర్వ నింక దను । జాంతకు ఖలు
రావణునిబట్టి చంపియు । రామ నన్నుఁ
జేరఁదీయవె కరుణయే । తీరెనేమొ?
బ్రతుకుదానను నినుఁజూచు । భాగ్యమున్న.

అయ్యో! ఇంకను నీదురదృష్టవంతురాలు శ్రీరామునిఁ జూడఁజాలునా?
అట్టిభాగ్యమేయున్న నిట్టియిక్కట్లు సంభవించును?

[ప్రవేశము:—రావణుఁడు]

రావ—

ఉ. కాంతరొ రామరామ యని । కాలము బుచ్చుట కేమియయ్యె నీ
కాంతుఁడె యాతఁడైన నిను । గానలపాలును జేసి పోవునే
యింతియొకాక సౌఖ్యమట । నేవిధి కల్గును సాధసీమలక్
వంతలటంచు బల్కెదవు । భామరొ స్వంతనమంద కీమెఱ.

తన్వీ!

గీ. రక్ష సాధకులందుండి । రమణి నన్ను
సంతసాంబుధి దేలించి । సౌఖ్యవకక
మానవాధము నొక్కని । మనసునందు
నిల్పి చింతంజిక్కుట । నీతియగునె?

ఆ రాముని జేపట్టి యింతదనుక నీవెట్టి సంతససౌఖ్యము లనుభవించి తివో తెలిసియు నిట్లుకుంద నేల? హాశ్రోడఁగూడియున్న, నీకు వలయు వస్తువాహనము లెల్లఁ గోరుటయె తడవుగఁ దెచ్చి యిచ్చెంతును. చీరినంతనే చేతులమోడ్చి క్రియాడిగము లొనర్చు దాసదాసీజన మెందఱో కలరు. వసించుటకా లెక్కకు మిక్కుటంబగు బంగరు మేడలున్నవి, ఇట్టిసౌఖ్యము లెడఁబాసి ఘోర మృగ నివాసంబగు కాననసీమల వసింప నేల? ఇంతయేల? నా పట్టపుదేవియగు మండోదరిచేతనే నీకుఁ బరిచర్యల సేయిం తును.

చ. అనయము నిన్ను పీఠ నెపు । డాదర మొప్పగ సేవఁ జేసి నా
వినయముఁ జూపెదింక సతి । వేగమె కావలె నీకృపారసం
బున నను ముంచఁజేయు మతి । మూర్ఖతనెల్లనె యోర్వఁజాలు దే
వనములసంచరించు వెత । వారిజనేత్రికి ధామకేటికిన్!

గతించినవానిని గూర్చి, విచారింపక, యింకను నట్టియిడుమ లంకుటకే యత్నించుచుంటివా? నినుఁబోలు మూర్ఖులీజగమున వేఱొక్క రుండరు. ఇఁకనైన వానినుండి నీమనమును దొలగించుకొనుము. రమ్ము నాయందఁజేరుము. సౌఖ్యమందుము. నరుఁడేల? సుఖిం పఁజేయుఁటల?

సీత—(తనలో) ఊరకున్నకొలఁదిని యీదురాత్ముని దుర్భాష లతిశ యించుచున్నవే. కటకటా! ఎట్టిమర్దశ ప్రాప్తించెను (ప్రకాశ ముగా) ఓరీ: మూర్ఖా: నీపూజలన్నియు నేఁ దేమంటిఁ గ్వ్వితి:

స్త్రీలోలుండవై యిట్లున్మాదునిక్రైవడి చరించుట తగునా? ఆ శ్రీరాముఁడు సామాన్యమానవుఁడని యెంచుచుంటివి కాఁబోలును. ఎందఱెందరి దుష్టులఁ బరిమార్చెనో వినలేదా? ఆతఁడేమియు సేయఁజాలని యబలుఁడనియే నీకునమ్మికయున్న, చోరునిభంగి, రామలక్ష్మణులు దఱిలేనివేళ నన్నేలకొనివచ్చితివి. ఇంతియేకాక, అంతదూరము పోనేల?

గీ. పరవనితల సాంగత్యంబు । పాపమంచు
నెఱుఁగవే యిట్లువంచింప । నెట్లుతోఁచె
ఎందఱెందఱు మడిసిరి । యింతులనుచు
మూర్ఖతనుకుఱింగి తలపవే । మూఢచిత్త.

రావ—ఓహో! నాకు నీతులఁగఱపుచుంటివా? ఆ రాముని నామమునడివి ప్రగల్భములఁ బల్కినంతనే భీతిలువాఁడనని యెంచుచుంటివి కాఁబోలును. ఈ ముల్లోకంబుల నాకెదురగువారే లేరు. ఇఁక నొక మానవమాత్రునిచే నే మడియువాఁడనే. ఇంతియెకాక, శతయోజనంబుల నిడివిగల యీవారిధిదాఁటి వచ్చినకదా రాముఁడు సమరమునకు గడంగుట.

చ. రమణిరో యేటిచింత లిఁక । రాముఁడగానుగ పత్నిపీడగన్
సమమెవరెందుఁ జూచినను । సాధ్యముకాదుగ నన్నుగెల్వఁగా
యమరులె వచ్చిమ్రొక్కెదరు । యారయనింకను రాముఁడేడనో
సమరముఁ జేయుటెడ యిది । సత్యముకాంతరో యెమ్ము రమ్మికన్.

సీత—అధమాధమా!

ఉ. పుట్టితి బ్రహ్మవంశమునఁ । బొంగెద వేటికి నీచకృత్యముల్
పుట్టినఁదోప నీప్రకద । పుణ్యముపాపము దుర్మదాంధ నీ
పట్టును వీడి రాము పద । పద్మముల౯ స్మరియించి వేడినన్
పెట్టెద [illegible] । [illegible] బాణ [illegible] నాడే.

నీమరుఁ రూర్తుల నీకనైనఁ గట్టిపెట్టుము. దుష్టాత్మా నిన్ను నిమిషమాత్రమున శాపదగ్ధునిగఁ జేయఁజాలుదును. కాని, శ్రీరాముఁడే వచ్చి నిన్ను సంహరించి పౌరుషమును నిల్పుకొనునని యూరకున్నదానను.

హను—(దాపుననే యొకవృక్షముపైఁ గూర్చుండి)

(14 వ అనుబంధము.)

అయ్యయో! ముల్లోకనాథుండగు శ్రీరామమూర్తికి ధర్మపత్నియై, పతివ్రతాతిలకమని ప్రసిద్ధివడసిన సీకాంతాలలామకెట్టి దురవస్థ ప్రాప్తించినది. రామాజ్ఞ లేకపోయెనుగాని, యీ దుర్మదాంధుని, యీ నీచప్రవర్తకుని, కామాంధకారుని నిమేషకాలమున హతమొనర్చియుందునా.

రావ—సీతా! నీవెంత దూషించినను, నవి నీయందుండెడు ప్రేమాతిరేకంబున భూషణములగుచున్నవి. ఇఁక రామునివలన మరణమందునా? రాముని సామర్థ్యము నే నెఱుంగనివాఁడను గాను. ఆ మానవాధమునిఁ జేరి నేను శరణుఁజొచ్చువాడనా? అతఁడు నన్ను సైరించి కాచునా? ఆహాహా! ఏమి నీపల్కులు?

సీత—ఓరీ! రాక్షసాధమా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అను వాక్యమసత్యమా! నీ కవసానకాలము ప్రాప్తించినది. ఇట్టివేళ బుద్ధులఁ గఱపినను నిష్ప్రయోజనమే.

రావ—(కోపముతో) సామముగ వేడుచున్నకొలఁదిని దూషణ లతిశయించుచున్నవి నిన్నీక్షణముననే వధించెదను. ఎవ్వరడ్డుకొందురో చూచెదను (అని ఖడ్గమును బూని వధింపబోవును.) (మరల వెనుకకు తగ్గి) సీతా! నీకు రెండుమాసములు గడువొసంగితిని. సరిగ యోచించుకొనుము. జరుగవలసిన వన్నియు జర [illegible]

లారా! మీరెట్లైన నీమె నొడంబడఁ జేయుఁడు. ఎంతకును విన కున్న నప్పుడే తగిన ప్రాయశ్చిత్తము కాగలదు.

(అని నిష్క్రమించును.)

హను—ఈదుర్మార్గుఁడు వదలినాఁడు. పోవుదునా? (ఆలోచించి) ఈ రాక్షసస్త్రీలును వదలుదురేమో, కొంతసే పరసి మఱి యుఁ బోయెదనుగాక.

సీత—హా! రామచంద్రా! ఇంకేమి తెరువు? ఈ దురాత్ముని పల్కులకుఁ జెవియొగ్గి జీవములతో నెట్లు భరించుదాన? నాథా! నీ వెన్నఁటికైనఁ దిరుగి వింకఁ జేరి యీ రావణుని దునుమాడి నన్ను జెఱను విడిపించెదవా? లేక నేనిచ్చోటనే యసువుల వీడుటకు నోచుకొంటినా? అయ్యో! నీమృదుమధురాలాపము లీచెవి నింక నెన్నఁడు సోకి యీ దుఃఖార్తిని వీడఁజేయునో కదా?

గీ. కోపమూపియు నీడికో । కోమలాంగ
కాక వెదకఁ దొడంగితో । కరుణహృదయ
ఎటులధరియింతు నీయార్తి । నెంతదనుక
సైపఁజాలుదు జీవముల్ । సానుభూతి.

రా-స్త్రీ—ఓసీ! ఎందుల కీరీతి సతతముఁ గన్నుల నీరు పెట్టెదవు? లక్ష్మి రానున్న వేళ మోకాలొడ్డువారుందురా? రావణుఁడన సామాన్యుఁడని యెంచుచుంటివి కాఁబోలును. ఆ రాక్షసేంద్రుఁడు తలఁచిన యట్టి రాములను పదిమందినైన రూపుమాప గలడు. ఇఁకనైన బుద్ధి తెచ్చుకొనుము. రావణుని జేరి సుఖించుము. రాముఁడు రాముఁడంచు యూరక యేల వాపోయెదవు?

లం-స్త్రీ—సీతా! చూడు మిప్పుడే నిన్ను మ్రింగివైచెదను.

(అని మీదికురుకఁబోవును.)

సీత—(భీతినొందును)

[ప్రవేశము:—త్రిజట.]

త్రిజ—రాక్షసాంగనలారా! మీకేల యీయార్భాటము? ఇటురండు. ఇప్పుడే నేనొక కలఁ గంటియుంటిని.

రా-స్త్రీలు—ఏమేమీ! కలయా! భయమా! చెప్పుచెప్పు.

త్రిజ—ఈ సీతాదేవి భర్తయగు శ్రీరామచంద్రుఁడు వానరుల సాహాయమున వారధి దాఁటి, లంకను జేరి, పుత్రమిత్రకళత్రాదులతో రావణుని నాశనముగావించెను. అయ్యో! భీతి జనించుచున్నది. ఇట్లు జరుగుట నిక్కము, మీ కీ పతివ్రతాశిరోమణిని శక్తి యున్న నోదార్చుఁడు. కఠినవాక్యములఁ బలుకకుఁడు.

రా-స్త్రీ—చెలువగార! మరలవత్తుము రండు. ఇంతలో నీమె యొంటి మొయి నాలోచించుకొనును. (అని త్రిజటతక్క తక్కినస్త్రీలు పోవుదురు)

త్రిజ—అమ్మా! సీతాదేవీ! ఊరడిల్లుము. నీపతి తప్పక కొలఁదికాలమున నిచ్చోటికిఁ జేరి, యీ దుష్టరాక్షసుల నెల్ల వధించి, నిన్నుఁ గొంపోఁగలఁడు. నామాటల నమ్ముము. సత్యము.

సీత—చెలీ! అట్టిభాగ్య మొదవునా? నీవే నాకిందు దిక్కు. నీపల్కులే నే జీవింప నాధారభూతములు.

త్రిజ—తల్లీ! ఇప్పుడే వచ్చెదను. చింతదక్కియుండుము.

(అని నిష్క్రమించును.)

హను—ఈసాధ్వితో మాటలాడుట కిదియే యదను. ఎట్లుపలుకరించువాఁడ. ఏ నటకేగి రామదూతనన్న విశ్వసించునో? విశ్వసింపదో కదా. (ఆలోచన నభినయించి) శ్రీరామచరిత్రను ముందుగ వినిపించెదను.

సీ. దశరథపుత్రుఁడై । ధరణి నవతరించి
చిఱుతప్రాయమువాఁడ । చేరి నటవి
దుష్టరక్కసులను । దునుమాడి కౌశికు
యాగంబుకాచినా । డంత తాటి
వాతిగఁ జేసియు । సీతను బెండ్లాడ
హరువిల్లు నవలీల । విఱిచివాఁడు
తండ్రి యాజ్ఞనుగొని । తరలివనంబుల
జానకిఁ గోల్పోయి । చనియుఁబిదప

గీ. వానరాధిపు సుగ్రీవు । వసునఁజేరి
వాలిఁగూల్చిన శ్రీరాము । వార్తఁదెలుప
నేఁగుదెంచితి నమ్మరో । యింకఁజేర
రాము మహిమంబు వర్ణింప । రాదు! వశమె.

సీత—(నలువంకలఁ దిలకించి) ఆహా! ఎవ్వరిందు రామచరిత్రమును బఠనసేయువారలు. (హనుమంతునిఁ గాంచి) ఈ వానరుఁ డెవ్వఁడు? మరల నెవ్వఁడో రక్కసుఁడు నన్ను వచింప నీరీతి వానరరూపమును దాల్చి వచ్చియుండనోపు. హా! శ్రీరామ చంద్రా! శ్రీరామచంద్రా!

సీ. ఏనాఁడు నినుఁజేరి । యిందిరారమణా నీ
ముద్దుమోమునుగాంచి । మురియనగునొ
ఏనాఁడు నినుగని । యింపారుపల్కుల
వీనులవిందుగ । వినఁగనగునొ
ఏనాఁడు వీక్షించి । యినకులేశ ముదమూ
రఁగ నిను భజియింప । నగునొ నాకు
ఏనాఁడు నీపాద । మెలమి నేభక్తితో
సేవించు భాగ్యము । జేరనగునొ

గీ. ఇన్ని సౌఖ్యంబు లెపుడైన ? నన్నుఁ దాంగ
గాంచఁగల్గుదునో లేదో ? కమలనయన
పాపఫల మీరీతిని ? బరఁగఁ జేసె
కటకటా యెట్టులోర్తును ? కాంతఁ బాసి.

(హనుమంతుఁడు వృక్షమును దిగి డాయుజని నమస్కరించి)

15 వ అనుబంధము.

హను—జననీ! సీతాదేవీ!

గీ. సందియంబేల మది నిట్లు ? సచ్చరితుఁ
డైన శ్రీరామబంటు నే ? నమ్ము నమ్ము
రాముపంపున వచ్చితి ? రమణి నిజము
వసుధ హనుమంతు డనగను ? వరలువాఁడ.

సీత—(తల యెత్తి చూచి) హా! నాథా! ఈ రాక్షసమాయలఁ దాటి యెట్లు బయల్వడుదాన ?

హను—తల్లీ! ఇఁకను శంక లేల? ఏను రక్కసుడనుగాను. నిజమైన రామభక్తుఁడను. శ్రీరామునివలన నే నీజాడ లరయుటకుఁ బంపఁబడితిని.

సీత—(సంశయకులాత్మయయ్యు) శ్రీరామునకుఁ గుశలమే కదా. లక్ష్మణుఁడు క్షేమమున నలరారుచున్నవాఁడె ?

హను—ఇరువురకును క్షేమమే. ఇదిగో! ఇట్లు నీవు నమ్మకపోవచ్చునని యొక సందేహముతోడ నీ ముద్రిక నొసంగుమని నా కొసంగె. (అని ముద్రిక నిచ్చును.)

సీత—(పుచ్చుకొని కండ్ల నద్దుకొని) ఓ ఉంగరమా!

ఉ. ఎన్నిదినంబులాయె నిను ? నేఁగని కన్నుల కానదీఱ నా
కన్నను నీవె యెక్కుడగు ? కాంతుని బాసి తపించుచున్న నీ

కెన్నివిధంబులన్ బలికి । యీవలవంతను మాన్పఁజేయగా
గ్రన్నన వచ్చి తుంగరము । గౌతుకమయ్యెను నిన్ను గాంచగాన్.

హనుమంతా! నానాథుని క్షేమసమాచారమును చెల్పి నాజీవముల గాచి పుణ్యము గట్టుకొంటివి. నీ ఋణ మెట్లు తీర్చుకొనగల్గుదును. నానాథుఁడు నన్నుగయుట కేమి యత్నములు కావించుచుండెను? లేక విసుగుజనించి యూరకుండెనా? మఱిది లక్ష్మణుఁడు తన్ను దుర్భాషలాడినందుకు నన్నెంతెగ నిందించుచుండెనో కదా. నిష్కారణముగ నా మహానుభావుని దూషించినందులకే నా కిట్టి యకారణయిడుములు ప్రాప్తించి యుండుచుంటిని.

హను—మాతా! ఆ రామలక్ష్మణులు నిన్ను వీడిన దాదిగ నిద్రాహారములు విసర్జించి, యున్మాదులవలె వడి చరించుచున్నారు. కొన్నాళ్ళకు వానరాధిపతియగు సుగ్రీవునితో సఖ్యముసల్పి వాలిని గూల్చి, యాతనికిఁ గిష్కింధాపురమును బట్టముగట్టినారు. వారియనుమతి ననుసరించి సుగ్రీవుఁడు వానరుల నల్దిశలకుఁ బంప, నా పుణ్యవశమున నే నిందుఁజేరి మిమ్ములఁ గంటిని. జననీ! ఆ రామచంద్రుఁడు వానరబలమును గూడి, కొలఁదికాలముననే నిన్ను చెఱ విడిపింపఁగలఁడు. తల్లీ! అంత యేల? సెలవగునేడ నేనే క్షణకాలమున నిన్నా శ్రీరామచంద్రుని కడకుఁ జేర్పఁగలను.

సీత—(ఆశ్చర్య చకితయై) అంజనీసుతా! నీ రూపమును జూడఁ జిన్నదిగ నున్నది. నీవెట్లు నన్ను గొంపోయెదవో తెలియఁజాలకున్నాను.

హను—నీకట్టిసందియమేల? నా నిజరూపమును జూపెదఁ గాంచుము. అప్పుడైన నమ్మిక జనించును.

(16 వ అనుబంధము)

(అని నిజరూపమును దాల్చును.

**సీత**—(భీతి నభినయించుచు) హనుమంతా! శ్రీరామభక్తాగ్రేసరా! నీ శక్తి యపారము. భీతిజనించుచున్నది. ఇఁక చాలించుము.

(హనుమంతుఁడు యెప్పటిరూపమున నిల్చును.)

**సీత**—ఆంజనేయా! నీవే నన్నుఁ గొంపోవ సమర్థుఁడవు. కాని, యట్లైన శ్రీరామునకు శక్తిలేక, రావణునివలెనే చోరునిభంగిఁ గొనిపోయెనని నాథునకు నిందకలుగును. కాన, యంతలకుఁ దాల్పఁజాలను. నీ వేఁగి, యా రామచంద్రునితో నావాక్యములుగా నిట్లు నుడువుము. "ప్రాణేశ్వరా! మిమ్ములఁ బాసిన దాదిగ నేఁ బొందు యిక్కట్టులెల్లను తెలుపఁజాలను. ఈ దుష్టరక్కసుని, యీ దశకంఠు నెన్నఁడు దునిమి నన్నుఁ జేరదీతువో కదా నాథా! రావణుఁడు రెండు నెలలు గడువుంచి పోయెను. ఇఁక నీ మోమును దిలకించక నిలువఁజాలను"

**హను**—అమ్మా! అట్లే చెప్పి కొనివచ్చెదను. ఇఁకఁ జింతఁ దక్కియుండుము. సెలవొసంగుము.

**సీత**—లక్ష్మణునితోఁ గ్రోధ ముడిగి నా తప్పులను సైరించి, నన్ను విడిపింప యత్నించుటకు వేడితినని చెప్పుము. పోయిరమ్మ ఈ శిరోమణిని నా నాథున కానవాలుగఁ జూపుము.

**హను**—జననీ! నాదొక ప్రార్థన. ఈ వనమునఁగల ఫలములఁ గొన్నిటిని దిని పోయెదను.

**సీత**—అయ్యో! ఈ రక్కసు లూరకుందురా?

**హను**—తల్లీ! నీ సెలవగునెడ వారిని నేనే కాచికొందును.

**సీత**—త్వరపడకుము. వలయుఫలములఁ గొనుము.

(హనుమంతుఁడు నిష్క్రమించును)

(తెర పడును)



మూడవరంగము:—రావణుని కొలువుకూటము.

[ప్రవేశము:— రావణుఁడు, విభీషణుఁడు, హనుమంతుఁడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుఁడు, యితర రాక్షసులు]

రావ—(ఇంద్రజిత్తునిఁ గాంచి) ఈ వానరాధముఁడే కదా! యశోక వనమెల్ల ధ్వంసమొనర్చి, యనేకమంది రక్కసులను బరి మార్చినది.

ఇంద్ర—అగుసీతఁడే.

రావ—ప్రహస్తా! వాని నిజవృత్తాంత మేమియో కనుగొనుము.

హను—ఓరీ! రావణా! ఏ నెవ్వఁడనో తెల్పెదను వినుము. తొల్లి నిన్నుఁ జెఱపట్టిన—

సీ. కార్తవీర్యార్జును । గడ తేర్చి యున్నట్టి
పరశురాముని భంగ । పఱచినాఁడు
వాలముచే నిను । వారధులను ముంచి
యాడ్చి తెచ్చిన వాలి । నేసినాఁడు
జానకికై నీవు । జనకునింటను జేరి
విఱువఁజాలని విల్లు । విఱచినాఁడు
తపసిజన్నముఁ గావఁ । దాటకిఁ దునుమాడి
సాటిలేని పేరంచు । జాటినాఁడు

గీ. దుష్టరక్కసులన్ బట్టి । దున్మినాఁడు
దునుమనున్నాఁడు నిన్నును । దుర్మదాంధ
అట్టి యనఘుఁడు ధీశాలి । యనఁగ నొప్పు
రామదూతను నేను రా । రావణుండ.

నాపల్కుల నాలించుము. ఆ పతివ్రతామతల్లిని, సీతాదేవిని జెఱఁ గొనివచ్చుట నీ యట్టివానికిఁ దగదు. ఆ శ్రీరాముఁడు మానవ మాత్రుఁడని యెంచకుము. ఆ మహానుభావుఁడు తలచినంత నే

ముల్లోకంబుల సృష్టింప, శిక్షింప సమర్థుఁడు ఇంతయేల ? ఆ మహావిష్ణువే భూభారమును దీర్ప ని ట్లవతారపురుషుఁడై జననమందెనని నమ్మెదము. సీతాదేవి మహాలక్ష్మి మూఢచిత్తుఁడవై యి ట్లకారణముగ నెందులకు జీవములఁ బాసెదవు ? ఇఁకనైన బుద్ధిఁగలిగి—

చ. అవనిజఁగొంచు బోయి మను । జాధిపుఁ జేరియు బోవుచున్న రా
ఘవుఁ డసమానధీరుఁడు య । ఘంబులఁ బాపెడు దివ్యమూర్తియా
యవనిజనించి భారమును । వార్పగఁజూచెడు యాదిదేవుఁడే
అవియువియంచుఁ దప్పులను । వారయకే నినుగాచు నిక్కమా.

రావ—(క్రోధముతో) విభీషణా! ఈతఁడు మనలంకఁజొచ్చి చేయరాని పనులఁజేసియు, నింకను నే మేమియో ప్రేలుచున్నాఁడు. కాలయాపనమెందులకు? వధింప నాజ్ఞ నిడెదను.

విభీ—రాక్షసేంద్రా! దూతయైనవీతని వధించుట పాడికాదు. విడచి పుచ్చుటయే ధర్మము.

రావ—అయిన నూరక విడువరాదు. (సేవకులను గాంచి) ఓరీ! ఈ కోతిని గొంపోయి వాలమునకు గుడ్డలఁజుట్టి యంటించి వదలి వేయుఁడు.

హను—ఇదియును గొంతలాభకారియే. ఇంకుచే నా యభీష్టము నెఱవేరున ట్లీలంకనుగాల్చి మఱియును బోయెదను.

(అని యా సేవకులతోఁ నిష్క్రమించును.)

(తెర పడును.)

నాల్గవరంగము:—అశోకవనము.

(17 వ అనుబంధము.)

సీత—పవనతనయా! వెంటనే రామునికడకుఁదిరిగిపోక; యీయుద్యాన

వనముల నేల పాడుచేసి, రక్కసుల దమమాడితివి. నీ వాల
మునకు నిప్పంటించుట కారావణుఁ డాజ్ఞనొసఁగెనని విని
నప్పటినుండియు నా మనమున భీతిజనించెను. అయ్యో! నీకెట్టి
ముప్పు ఘటిల్లెనో కదా.

గీ. రామనామంబె మదినెంచి । రాత్రిఁబవలు
భక్తి నాథునిఁగొల్చుచు । పరగుచున్న
పాతివ్రత్యమందున ఘన । పటిమయున్న
పవనతనయుఁడు సుఖమున । వరలుగాత.

[ప్రవేశము:—హనుమంతుఁడు.]

హను—(చేతులమోడ్చి) జననీ! జానకీదేవీ! భవదీయకరుణా కటాక్ష
మున సుఖినైయున్నాఁడను. లంకాదహన మొనరించువేళ మీ
కెట్టి కీడుమూడెనో యని భయమంది తిరుగ మిమ్ముల దర్శించి
పోవనేతెంచినాఁడను. ఇదే పోవుచున్నాఁడను. సెల వొసం
గుఁడు.

సీత—ఆంజనేయా! నీభక్తి సామర్థ్యములు వర్ణనాతీతములు. నీ వెం
దులకైన సమర్థుండవే. శుభమగుఁగాక! పోయి వేగముగ రామ
లక్ష్మణులఁ దోడ్కొనివచ్చి నన్ను విడిపింపుము.

హను—చిత్తము. (అని నిష్క్రమించును.)

(తెర పడును.)





శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము.



## పంచమాంకము.



మాల్యవంతప్రాంతము.

[ప్రవేశము:— రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, కొందఱువానరులు.]

సుగ్రీ— ఆర్యా! శ్రీరామచంద్రా! ఇంకను సందియమేల? దక్షిణదిశ కేగిన అంగదుఁడాది ప్రముఖులు సీత జాడ లరసియేయుందురు. లేకున్న మధువనమును బాడుసేయుటకు సాహసింపరు.

రామ— వారికై కబురునంపియుంటివికదా.

సుగ్రీ— అదిగో! సందడియగుచున్నది. వచ్చుచున్నటులున్నది.

[ప్రవేశము:— హనుమంతుఁడాదివానరులు.]

(అందఱును శ్రీరామలక్ష్మణులకును, సుగ్రీవునకును నమస్కరించును.)

జాంబ— ఆంజనేయా! మన మెట్టివార్తను దెల్పుదువో యని, వేచియున్న శ్రీరామునకు, జానకి వృత్తాంతమంతయును వినిపింపుము.

రామ— హనుమంతా! సీతను గాంచివచ్చితివా?

గీ. అవనిజను గాంచివచ్చితే । యాంజనేయ
సీత యేమని చెప్పెనూ । శీఘ్రగతిని
ఎటుల నైపగఁ జాలెనో । యింతి నన్నుఁ
బాసి యెఱుఁగదు యెన్నఁడు । పలుకు లేమి?

సుగ్రీ—పవనతనయా! భక్తాగ్రేసరా! కాలయాపనమేల? వేగముగ వెలిఁబుచ్చుము.

18 వ అనుబంధము.

హను—స్వామీ! శ్రీరామచంద్రా! సీతామహాదేవినిగాంచివచ్చితిని.

లక్ష్మ—ఆహా! ఎందులకైన సమర్థుఁడ వీ వేకదా!

హను—ఆర్యులారా! ఆముల్లోకజనని, సీతామహాసాధ్వి యనుభవించుచున్న దురవస్థ నేమని తెల్పువాఁడ? నిరతము తదేకధ్యానంబున “రామరామ” యనుచు, కన్నీరుమున్నీరుగాఁ బ్రవహించుచుండ, రాక్షసస్త్రీలు దరిఁజేరి, పలుకరాని దుర్భాషలఁ బల్కుచుండ సహింపనోపక, యాహారిణేక్షణ సింగంబుల నడుమఁజిక్కిన బాలకురంగంబునై వడి దుఃఖార్తిని బొగులుచుండెను. కటకటా! శ్రీరామునిఁ జూడనెంచి జీవములతో నిల్చియుండజాలెనే కాని, దుష్టాత్ముండగు నారావణుని దురాలాపములఁ జెవిదాల్ప శక్యమగునా? రామచంద్రా! ఆజానకి నెలదినములు మాత్రమెట్టులనో యెన్నిశ్రమలకై ననోర్చియుండుదానని యు, నీలోపునఁ దన్నా దానవాధముని బారినుండి తప్పింపుమనియు, లేకున్న జీవముల నిల్పనోపననియు నుడివె. ఆసీతాదేవి యనుభవించుచున్న యిడుమ లిట్టివియని తెలుపజాలను. అక్కటకటా! జనకునికిఁ బుత్రికయై, దశరధునకుఁ బెద్దకోడలై, అసమాన బాహుపరాక్రమధురంధరుఁడగు శ్రీరామచంద్రునంతటి [illegible] యై, పతివ్రతా[illegible] [illegible] పన్న

కెక్కినసీతామహాదేవి, నేఁ డాయశోకవనంబున, నెండవానలకు సహించి యనుభవింపరాని దుఃఖ మనుభవించుచున్నదికదా! రామా! నాకు మీయాజ్ఞయే లేకుండెనుగాని, యాదుర్మదాంధుని- పరనారీహింసాకరుని- దుష్టాత్ముని- యారావణుని క్షణకాలమున దశశిరములఁ గనుమాడి సీతను గొనివచ్చి మీ పాదపద్మముల కర్పించియుండనా? ఆపె యిడుమలను దలంచిన నెంతటిధీరునకైనను మనము చలియింపకుండుననుట కల్ల.

సుగ్రీ—కటకటా! ఆంజనేయా! లంకాపురమందలి విశేషము లేమి?

లక్ష్మ—(కోపముతో) ఓరీ! రావణాధమా! నీచపరివర్తా! వినాశకాలమే సమీపించుచున్నది.

గీ. ఎందుఁ బొచ్చెదవో యిఁక । నెవరిఁ జేరి
శరణు వేఁడెదో రావణా । చాపుమూడె
కాక, యీసీతఁ దోఁచునే । కాంతఁబట్టి
చేటుకాలము వచ్చెను । ఛీ! దురాత్మ.

సుగ్రీ—లక్ష్మణా! శాంతించుము. తినఁబోవుచు రుచిని గోరనేల?

హను—మహాత్ములారా! వినుఁడు. కార్యసాఫల్యమునకై యెన్ని యిడుమలైనఁ గుడువవలెనుగదా. ఏను నూరుయోజనంబుల విస్తర్ణముఁగల వారిధిని దాఁటి, లంకకుఁ బోతిని. పోయినతర్వాత నాపట్టణమంతయుఁ గలయఁదిరిగి, గృహములన్నియు శోధించితినికాని, సీతయున్నజాడమాత్రము తెలియదాయెను. తుదకామె జీవములనే బాసియుండెనేమో యని యెంచి, యాయశుభవార్తను దెల్పుటకన్న నసువులను వీడుటయే శ్రేయోదాయకమని యెంచితిని. కాని, నాపూర్వపుణ్యమున—

గీ. కనఁబడె నశోకవనమున । [illegible]

తెలుపఁ దొలుతను నమ్మక । పలుకకునికి
ముద్రిక నొసఁగితిని నేను । ముదితకంత.

ఆమె దానిని కనుభక్తిశ్రద్ధలతోఁ గైకొని కండ్లకద్దుకొని పిదప రాములక్ష్మణుల కుశలంబడిగెను. తన బాధలన్నియు వెల్లడించి రామునకెఱిఁగించుమనియె. ఆమెయొద్దసెలవుగైకొని యశోకవనంబంతయు ధ్వంసముఁజేసి, పెక్కుమంది రక్కసులం బరిమార్చి, కడకాయింద్రజిత్తుచే సంధింపఁబడిన బ్రహ్మాస్త్రముచేఁ గట్టబడి రావణునొద్దకుఁ గొంపోబడి పెక్కునీతులఁ జెప్పితిని ఆదుర్మార్గుఁడు నాపలుకుల కాగ్రహించి, నావాలమును గాల్పనాజ్ఞ విడెను. ఆసేవకు లట్లొనర్ప, లంకాదాహన మొనర్చి, తిరుగ సీతాదేవి యేమాయెనో యని సందియమంది, యామెను జేరి పోవుచుంటినని తెల్పి, బయలుదేఱివచ్చితిని. ఇదియే నేఁబోయివచ్చిన వృత్తాంతము.

(అని శిరోమణిని రామున కొసంగును.)

రాము—హనుమంతా! పరోపకారపారీణా! నీయుపకార మెన్నఁటికిని మఱువఁజాలము.

హను—స్వామీ! ఇదంతయుఁ దమ కరుణాకటాక్షవీక్షణమే కాని, వేఱొండు కాదు.

రాము—సుగ్రీవా! ఇఁక ముందు కర్తవ్యమేమి?

సుగ్రీ—మహాత్మా! కర్తవ్యమున కేమున్నది? రణమాచరించుటయే యిఁక మనము చేయవలసిన కార్యము.

రాము—అయిన సేన లన్నియు సిద్ధముగనుండెనా?

సుగ్రీ—చిత్తము.

రాము—అంగదాదివానరవీరులారా! మీరు సేనాధిపత్యముల వహింపవలెను.

అంగ—చిత్తము.

రాము—ముందుగ మన సేనలన్నియు లంకకుఁబోవుటకు సేతువుఁ గట్టవలెను. ఈపని యచిరకాలములోనే ముగియవలయును. హనుమంతా! సీతనుగాంచివచ్చితివి. లంకాదహనముఁ జేసితివి. నిన్ను గొనియాడుట కలవియగునా? ఈయుద్ధరంగమున నీసాహాయ్యమే మాకు ముఖ్యము.

(తెరలో)

విభీ—ఆర్తజనరక్షకా! భక్తపరాధీనా! శ్రీరామచంద్రా! శరణు శరణు.

(అంద ఱాశ్చర్యనిమగ్నులై చూచుచుందురు.)

రాము—ఈయార్తారవ మెవ్వరిది?

లక్ష్మ—సోదరా! ఇదియు నొకరాక్షసుని మోసమనియే తోచుచున్నది.

సుగ్రీ—తిరుగ మిమ్ములమోసగింప ఖలుండగు రావణుఁడే యారీతిని వచ్చియుండెనేమో.

అంగ—అట్లయిన రామా! ఆ యధమాధము నిచ్చోటనే దునుముట యుచితము.

రాము—త్వరపడెదరేల? కొలఁదిసేపటిలో నన్నియు వెల్లడికాఁగలవు.

హను—రక్కసులలో నొక్కఁడగుట సత్యము. ఎవ్వఁడోగుర్తింపఁ జాలకున్నాను.

[ప్రవేశము:—విభీషణుఁడు]

(19 వ అనుబంధము)

విభీ—(చేతులమోడ్చి)

గీ. మాదుమూర్తుల కెల్లను ॥ మూల మెవఁడో
ముజ్జగంబుల కాధార ॥ భూతుఁ డెవఁడో

శరణువేడి యెల్లర । నైచుననవఁడొ
అట్టి పరమాత్ము సేవింతు । నరయుననన్ను.

మహాత్మా! శ్రీరామచంద్రా! ఏపాపాత్మునివలన నెల్ల వేళల ముల్లో కంబులు తల్లడిల్లుచు ఘోషిల్లుచుండెనో, ఏదుర్మార్గుని జననముచే సురగణంబులెల్ల భీతిలి యడఁగియుండవలసివచ్చెనో, ఏ క్రూరాత్ముఁడు నీమహిమను గనలేక, ముల్లోకమాతయగు సీతామహాదేవిని చెఱఁబట్టి లంకకుఁ గొంపోయి లంకయందుంచెనో; యట్టి రావణాధముని సోదరుండను విభీషణుఁ డను వాఁడ.

ఉ. రాముఁడవంచు నీభువిని । రాజకులంబున నుద్భవించి, యీ
భూమిభరంబుఁ దీర్పఁగద । భూరియశుండవు నిర్మలాత్మ నీ
నీమము నెల్ల దుష్టులను । నేర్పున వింతగ సంహరింపవే
పామరుఁడ సదా మదిని । భక్తిని గొల్చుచునున్నవాఁడ నే

గీ. దీనపోషక నినునమ్మి । సానుభూతిఁ
జేరినాఁడను గావఁగఁ । జేయిమోడ్చి
మ్రొక్కుచున్నాఁడ నిక్కము । మోహనాంగ
కాచినను కావకున్నను । గలదె దిక్కు.

నా యీ దీనాలాపము లన్నియుఁ గపటములని తలపోయకుము. ఏ నట్టి పాతకుఁడను గాను. సీతాదేవి నిట్లకారణ యిడుముల పాలుసేయుట తగదనియు, తత్క్షణమే శ్రీరామ పాదపద్మముల కామె నర్పించి శరణువేడిన, రక్షించుననియు నుడువ, నాఖలుఁ డాగ్రహచిత్తుఁడై, నన్ను దనకాళ్ళను దన్ని పలువిధముల దూషింపసాగెను అందుచే నే నటనుండ సహింపనోపక, మిమ్ముల శరణువేడ [illegible] వచ్చితిని. ఆకేఁడు నాకు [illegible] దేవుఁడై [illegible] ఘటించె నాతని వధించు

టను గూర్చి చింతనొందను. ఇదియుఁగాక మీకు రణమునఁ దగినంత సాహాయ్య మాచరించువాఁడ—

రాము—సుగ్రీవా! ఇందు నీ యభిప్రాయ మేమి?

సుగ్రీ—రాక్షసమాయ నెఱుంగ శక్యముకాదు.

రాము—లక్ష్మణా! ఏమి సేయఁదగును?

లక్ష్మ—ఆర్యా! ఈతని వృత్తాంతము హనుమంతుఁ డెఱిఁగిన తెలియును.

రాము—ఆంజనేయా! ఇందు నీ వేమి నుడువుదువు?

హను—మహాత్మా! ఈతఁడు నిక్కముగ శిష్టుఁడే. ఈతఁ డసత్య మాడువాఁడు కాఁడు. ఆనాఁడు రావణుఁడు నన్నుఁబట్టి వధింప నున్న వేళ, సీతఁ గాపినవాఁ డితఁడే ఇదియుఁగాక, యీతని మూలమున మనకు సాహాయ్యముగూడఁ గల్గును. కావున, శరణ నొసంగుటయే ముఖ్యమని నా యభిప్రాయము.

రాము—(విభీషణునిఁ జూచి) విభీషణా! విను పలుకులను

గీ. రావణునిఁ గూల్చి రణమున । రాజ్యమంత
నీకు బట్టముఁ గట్టెద । నిక్కమిదియు
నందియుంబంద కింకను । సాహసమున
సాయమగు మాకు నింతట । సంగరమున.

విభీ—మహాప్రసాదము.

రాము—ఇంక మనము తడయనేల? పోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

తెర పడును.

రెండవరంగము:—సముద్రతీరము.

[ప్రవేశము:—రాముఁడు, లక్ష్మణుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు, వానరసేన.]

రామ—వారధిఁగట్టుట యైనది. ఇదియే తొలుతఁ గొనసాగుట కడు దుర్లభమని తలపోసితిమి. ఇంతకును దైవానుగ్రహమున్న నెట్టి ఘనకార్యమైనను సాధింపవచ్చును గాదె. ఆ పంక్తిరథుని గెల్చుట కిదియు నొక శుభశూచకమే.

విభీ—అవతారమూర్తులగు మీ కసాధ్యంబగు పని యెద్దికలదు?

సుగ్రీ—ఈనలుఁ డిట్టివాఁడని, యీ సముద్రుఁ డెఱుంగుటవలన మనకుఁ దెలియనయ్యెను గాని లేకున్న నీ వారధి బంధించుటయే కష్టతమమై యుండును.

లక్ష్మ—అగ్రజా! ఇఁక కర్తవ్యమేమి?

రామ—లంకకుఁబోయి, రణమున రావణుని గూల్చుటయే కాని, నా కొక యాలోచన వొడముచున్నయది. ఏమందురా కడసారి మరల రావణునొద్దకు రాయబారి నొకని బంపు టుచితము.

సుగ్రీ—రామా! మీ రెదురాడి వర్తించువారము కాదు కాని, హనుమంతుఁడేగినవేళ నెన్నియో బుద్ధులు గఱపెను. వినఁడాయె. విభీషణుఁడు సోదరవాత్సల్యముఁ బూని హితములఁ బల్కినందులకే కదా యతనిదూషించి, రాజ్యమందు నిలువవలదని తఱిమివేసియుంట. అట్టితఱి నింక రాయబారుల నంపు టెందులకు? వినాశకాలము దాపరించువేళ, హితములఁ జెప్పువారే శాత్రవులవలెఁ గన్పట్టుదురు. తోఁగ కాపథసేవయే యయిష్టమై తోఁచును.

రామ—విభీషణా! యిందు నీయభిప్రాయమేమి?

విభీ—ఆమూర్ఖుఁడు చెవిదాల్చినను, దాల్పకున్నను బంపుటయే ధర్మమగును. దండోపాయము కడపటి యేర్పాటుకదా.

అందఱు—అయిన నట్లే కానిండు.

విభీ—ఇందులకు యీ అంగదుఁడే తగియుండును

రాము—అంగదా! నీవు రావణుని కడకేఁగి నాపల్కులనిట్లు నుడివి పర్యవసాన మెఱింగి రమ్ము

ఉ. రావణ దర్పమేల రఘు । రాముఁడ వచ్చితి నిన్ను కూల్ప నీ
కావరమింకనైన విడు । కాంతను సీతను జేర్పుమా వడిఁ
ఈవిధిఁ జేతువేని వడి । నీర్ష్యను బాసియు నీకు వాడ నీ
భావనలేమొ తెల్పు మిఁక । భావ్యము కాగ దానవేశ్వరా.

గీ. రణముఁ జేయంగ భీతిలి । రాముఁ డిట్లు
రాయబార మంపెనటంచు । రాత్రిసేదవి
తలఁచి దర్పంబులాడకు । తగవుతగదు
రూపుమాయుట యింకనైన । రూఢిఁదలుచు.

అంగదా! వేగముగఁ బోయి రమ్ము

అం—చిత్తము.

(అని నిష్క్రమించును)

రాము—సుగ్రీవా! మనమును లంకాభిముఖులమై బయలుదేఱుదము.

సుగ్రీ—చిత్తము.

(అందఱును నిష్క్రమింతురు)

(తెర పడును.)





శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# లంకాదహనము

అను

# విభీషణపట్టాభిషేకము.



## షష్ఠాంకము.



లంకాపురీ రాజసౌధము.

[రావణుడు, కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుడు మొదలగు రాక్షసులు ప్రవేశము.]

రావ—మంత్రిశేఖరులారా! ఆ రామలక్ష్మణులు వానరులఁ గూడి, మనపైకి దాడివెడల సిద్ధముగ నున్నారును. సేతువును గట్టినట్లును గూడ తెలియవచ్చెను. ఇంతయుఁజూచి చాల నాశ్చర్యమును గొల్పుచున్నయది కాదనుకొం.? సారథిని బంధించుట యేల? ఆ శ్రీరాముఁడు సీత నరయుటకై బయల్వెడలి, వనముల సంచరించుచు. సుగ్రీవునితోఁ జేరి వాలిని వధియించి యుండెను గదా. వారందఱిప్పుడు లంకను జేరుచున్నారఁట. ఇప్పుడింకఁ గర్తవ్యమేమి ?

ప్రహ—రాక్షసేశ్వరా ! ఇందుల కింతగ నాలోచన సేయనేల ? వానరులఁ గూడి వచ్చిన నామానవులా మనలను జయించుట.

కుంభ—సోదరా! లంకేశ్వరా! నా మాట లాలించుము. శ్రీరాముం డన మానవమాత్రుఁడని తలపోయకుము.

గీ. ఆమహావిష్ణువే యిట్లు । యవతరించె
భూమిభారంబుఁ దీర్పఁగఁ । బుడమినిట్లు
కాకశక్యంబె నరులకు । గాననములఁ
జేరి వధియింప వాలిని । చింతవలదె.

ఆమహానుభావుఁడు జగదేకవీరుఁడు. ఆతని గెల్చుట కీముల్లోకంబుల నెవ్వరికిని శక్యముకాదు. దేవతాగణము లెల్ల నీకై వెఱపంది, యెదు వెద్ది యుచుగానక, యా యాదిదేవుని కడకేగి మొఱవెట్టుకొన, ముందు భూలోకంబున దశరథునకుఁ బుత్త్రుఁడనై జన్మించి, శ్రీరామనామంబునఁ బరగుచు, రక్కసులనెల్ల నుగ్గుమాడి, భూభారముఁ దీర్చి మీ యార్తిని దీర్చెదనని వాగ్దానమొనర్చెనని వినియుండలేదా? తత్కారణమున నిప్పుడియిల నవతరించెను నీ వెంచినట్లాతఁడు మానవమాత్రుఁడు కాఁడు. నీ వెవతెను జెఱఁబట్టికొనివచ్చితివో యామె ముల్లోకమాత యగు లక్ష్మీదేవియే కాని, సామాన్యపువనిత కాదు. మనల నందఱఁ దన కోపాగ్నిచే భస్మీభూత మొనర్పఁగల్గియు నేకతంబున నోర్చి యూరకుండెను. ఇంతయేల? ఒక్కటి తెలఁపుము. ఆ రాముఁడు మానవమాత్రుఁడనియే యెంచుము. పరవనితలఁబట్టుట పాపహేతువు కాదా? ఆసీతాదేవి సంతాపాగ్నియే మనల దహింపజాలదా? బాగుగనాలోచించుము. చేతులు కాలిన వెనుక నాకులనుముట్టిన నేమియుఁ బ్రయోజనము లేదు. శ్రీరాముఁడు కరుణాసముద్రుఁడు. శరణాగతవత్సలుఁడు. చేసినదానికై చింతనొంది యిప్పుడైన నా మాటను గొనిపోయి, రాముపాదము కర్పించి శరణువేడిన నాతడు తప్పక నీ తప్పుల సైరించి, రక్షించును.

రావ—(కోపముతో) ఛీ! నీ నోటినుండి నేఁ డిట్టి యధైర్యపువాక్యములు

వినఁబడెను. నీకు భయమగునెడ యుద్ధ మాచరింపక నేమూలనో యొదిగియుండవలెఁ గాని, నాకు నీతులఁ గఱపుచుంటివా ?

కుంభ—సంగ్రామమునకు వెఱచి యిట్లుపలుకుచుంటినని తలంపకుము. నా ప్రాణములపై నా కొకింతయును దీపిలేదు. కాలము సమీపించినతఱి, నన్నియు విరుద్ధములుగనే తోచును. కానిమ్ము. తెలిసినంతదనుక తెల్పితిని. ఆ శ్రీరాముని వలన మరణమే కల్గిన నీకేఁ గొఱఁతయేమి? పుణ్యలోకములందనగును లేకున్న నాతనినే జయింపఁ జాలుదువేని లోకంబుల ఖ్యాతినందవచ్చును.

(21 వ అనుబంధము.)

ఇం—జనకా! వేయునేల? రాముఁడేడ? మనల జయించు టెవ్వ? వానికిఁ దోడుగ వానరసైన్యమా? వారిరాకను వినినంతనే మనము భీతిలుటయా? ఆతఁ డవతారపురుషుఁడై, నిజముగ భగవానుఁడేయైన నింతదనుక నెచ్చోట డాగియుండెను. ఇంతేయుఁ గల్లు. సమరమునకు వెనుదీయుటమిముఁబోలు శూరశిఖామణులకు లక్షణముకాదు. వెఱపేమియు నెఱుంగని దానవకులమునకు నేడు కళంకమును గూర్చుట పాడికాదు. ఆ హనుమంతుఁడు తొలుత నెన్నిరీతుల వీరాలాపముల వెలిబుచ్చెను. తుదకు నాచేఁ బట్టువడలేదు? వారి ప్రగల్భము లన్నియునిట్టివే.

రావ—సెహబాస్. మంచిమాటఁ జెప్పితివి.

[ప్రవేశము:—శుకసారణులు.]

శు—రాక్షసేంద్రా! నమస్కారము.

రావ—ఓరీ! మీ రేగిన పని యేమైనది. ఏమేమి వింతలనరసి వచ్చితిరి?

శు—ఆర్యా! వారిసేన యపారము. వారి శక్తిసామర్థ్యముల వర్ణింప

వలవి కాదనియే గాయభీగాగ్ని నును ముందుగనా వానరులంద
ఱు మమ్మునుబట్టి వధింపుడనియే రాముగకిఁ బ్రోత్సాహమును
గల్పించిరికాని, యా మహానుభావుఁడు కడు ధర్మశాలి యగు
టచే, వలదని వారించెను అందుచేఁ దిరుగ మిమ్ములఁ గన్నులఁ
గాంచుటయయ్యెను. లేకున్న—మారీచ సుబాహులు వలె
నే—విభీషణుఁడు వారిఁజేరినాఁడు. ఆరాముఁ డాతనికి లంకా
రాజ్యమునకు నాథునిగఁ జేసెదనని వాగ్దానమొనర్చెనట.

రావ—(క్రోధముతో) ఆ ఏమి? ఈ దుర్మార్గుఁడు శత్రుపక్షము
వాఁడై, మనగుట్టు నంతయు వెల్లడించు చుండెనా? ఆ మూన
వాధముఁడు రాముఁడాతనికి లంకారాజ్యమును బట్టముగట్టునా?
ఓరీ! విభీషణా!

గీ. శత్రువులకడఁ జేరియు । శరణుఁజొచ్చి
ఆశ్రయించితె నరులను । యధమ మనక
లంక నేలంగ నెంచితో । వంక మబ్బి
బ్రదుక నిచ్చినసే గదా । ప్రబలు టధను.

ఇట్లు పరులపాదములఁబట్టి భజియించు యుధగాధముఁడ వౌదువని
కలనైనఁ దలంపనైతిగదా ఓరీ మూర్ఖచిత్తా! నీమూలమున
రాక్షసకులమున కంతకును యపవాద మబ్బెనే నిన్ననేల?
ఆవాఁడు నిన్ను దునుమక విడిచిపుచ్చుట వాదియే నేరము.
కాకున్న కులము నిష్కళంకమై యుండునుగదా.
(శకుని జూచి) ఇంకను విశేషము లేమి?

శుక—రాక్షసేంద్రా! వారధిని గట్టిరి. వానరసేన క్రమక్రమముగ
లంకను జేరుచున్నది.

రావ—సరియే మీరుఁ జనుఁడు. మంత్రులారా! ఇఁక మనసేనల సిద్ధ

హామూచరింతువు. రాముఁడన నెట్టిబలశాలి యో యెఱింగియు నిట్లు మూఢచిత్తుఁడవైన నెవ్వరుబోధింపఁజాలుదురు. తెలియని వానికిఁ దెలుపఁ దగునుగాని, తెలిసియుఁ దలఁడాల్చెదనను వానికిఁ జెప్ప సమర్థులెవ్వరు? నీవు నిజముగ నీపుత్రమిత్రకళత్రాదులతో సేమముగఁ గడుప నెంచినపక్షమున మూఢత్వమును వీడి, రామునియొద్దకేగి, సీతనర్పించి శరణు వేడుము. ఈలంకారాజ్యము విభీషణునకు దాన మొసంగినరీతిని, నీ కాయయోధ్యారాజ్యము నిచ్చును.

రావ—(క్రోధముతో) సేవకులారా! తత్క్షణమే వీనినిబట్టి వధించుఁడు.

ఇం—రాక్షసేంద్రునిచే నింతనిర్భయమా? ఇంత కావరమా?

(రాక్షసులు అంగదునిఁబట్ట జుట్టునుమూగుదురు.)

అం—ఓరీ! నీచులారా! మీరా నన్నువధించుట. రండు అందఱ నొక్కమూఱుగ వధించి మరిమునుబోవువాఁడ. (తనలో) ఇట నకు వీరితోఁ బోరాటమునకుఁ గడంగుట తగదు ఒకవేళ నట్టి పనిచే దశ్మోనను సంధి విరుపవచ్చును.

(అని ఒకరిద్దఱిని గొట్టి పాఱిపోవును.)

(తెరపడును)

రెండవరంగము.

అంతఃపురము.

[ప్రవేశము:—రావణుఁడు, మండోదరి.]

రావ—తన్వీ! ఎందులకుఁ గబురుసంపితివి?

మం—నాథా! శ్రీరామునితో సంధియా? లేక సమరమా?

రావ—ఒకమానవాధమునితో నాకు సంధియేమి? సమర మేనిశ్చయము.

(21 వ అనుబంధము.)

మం.—ప్రాణేశ్వరా! నాపల్కులను గ్రహింపకుండు, రాముడన నెవ్వరని యెంచితిరి? ఆమహానుభావునితో మీరు సమరమా? సకల లోకవంద్యుడు. అసమాన బాహువిక్రముడు. శూరశిఖామణి. అవతారపురుషుడు. దుష్టులను రూపుమాపి, భూభారమును దీర్పనెంచి, యీయవని నవతరించిన వాడు మహావిష్ణువు. ఆతని శౌర్యము దలంచి, బ్రదుకంగలవా రెవ్వరు? నిక్కమరయుడు. మీకు దెలియని విషయము లెవ్వియును లేవు తనకోపమే తనకు శత్రువగును. క్రోధమువలన బ్రతికార్యమును జెడును శాంతమే భూషణము. అదియే సర్వకాలములందును, సర్వావస్థలయందును మిత్రునివలె నుపకార మాచరించును. మీరు సీతాదేవినిం బట్టనెంచి, జనకుని గృహమునకుం బోయి హరువిల్లు విఱువ నెత్తించిరి. సాధ్యమయ్యెనా? మీ కసాధ్యంబగు నావింటిని శ్రీరాముం డవలీల విఱచెను. వాలి మీకన్న బలవంతుండు కదా అట్టివాలిని నిమిషమాత్రమున నొక్క బాణముచేం జెండాడెను ఇంతయు నిక్కమగునా? కాదా? అట్టి త్రైలోక్య వీరుని జయించుటకు మీకు శక్యమగునా ?

రావ.—దేవీ! జయాపజయముల నిర్ణయింపవశమగునా?

మం.—నాథా! శ్రీరాముని పరాక్రమసామర్థ్యము లెట్టివో నెఱుగుదురు. మహా పతివ్రతాశిరోమణియగు సీతయొక్క యుశ్రుబిందువులు రాక్షసకులము నిర్మూలము గావింపం జాలవా? పరనారీమణులంబట్టుట మహాపాతకముకదా. ప్రాణేశ్వరా! ఆసీతాదేవి నిద్రాహారములవిసర్జించి, శోకాకులచిత్తయై గడియించుచున్న యాసీత నీ లంకకుం దేర్చినదాదిగ లంక కళావిహీనమై కన్పట్టుచున్నయది.

మీసోదరుఁ డగువిభీషణుఁడు మి మ్మొడఁబాసి శత్రువర్గమునఁ జేరెను.

రావ—అనీచుఁడు నాసోదరుఁడుకాఁడు. అట్టి యధము డుండుటకన్న లేకుండుటయే యెంతయు శ్రేయోదాయకము.

మం—హితముఁ గోరువారందఱు నీచులే యగుదురుకాఁబోలును. కట కటా! దుశ్శకునంబు లెన్నియో కానవచ్చెను. నాథా! సమరమువలదు. ఆసీతాదేవిని శ్రీరామునకొసంగి శరణువేఁడుఁడు. ఆతఁడు మిమ్ముల సైచును. నావల్కుల నాలించుఁడు.

రావ—(కోపములో) ఛీ! దుర్మార్గురాలా? ఆరామునికి సీతనర్పించి శరణువేఁడవలెనా? ఆతఁడు నన్నుఁ గాపాడునా? నిన్ననేల? స్త్రీ లకిట్టి స్వాతంత్ర్యమొసంగుటయే తప్పు. చాలుఁ జాలు. ఇఁక నీవేమియుఁ బలుకనగత్యము లేదు.

మం—(పాదములపై వ్రాలి) నాథా! నావల్కులాలించరా? అయ్యో ఇట్టి మూర్ఖత్వ మేలజనించెను. కటకటా! మీభక్తియంతయు నేఁ డేమాయెను. ఇంతగ జ్ఞానశూన్యం బగునని కలనైన నెంచ లేదుకదా! పుష్పమనియెంచి మంటనుబడి మ్రగ్గు పురుగుచందా న మీరిట్లకారణముగ మృత్యువునకుఁజోటొసంగుట పాడికాదు.

రావ—(కాలినిదన్ని) ఛీ! పాపాత్మురాలా! నాయెదుటనుండి తొలఁగిపొమ్ము.

మం—నాథా! న న్నన్నివిధముల దూషించినను నాకుఁ జింత కలుగదు.

గీ. న్యాయ మన్యాయమెఱిఁగియు । నాథ! యిట్లు
పరసతులఁ బట్టితెచ్చుట । పాడియగునె?
మృత్యుదేవతఁ జేరెదు । మూఢుడన్న
తలచవలదొక్కొ సత్యము । దనుజనాథ.

సీ. దనుజేంద్ర వినుమయ్య । దానవాంతకుఁడగు
శ్రీరాముఁ డరయఁగ । సీతయేల?
మానవుఁడేయైన । మడిఁబుంప వాలిని
సాధ్యమే కనుమయ్య । సానుభూతి
అవతారపురుషుఁడు । ఆరాముఁ డెన్నఁగ
శ్రీమహావిష్ణువే । చేరి కిటుల
హరువిల్లువిఱువఁగ । నాతనికే తక్క
నొరులకు శక్యమే । పరమపురుషు

గీ. నెంచఁదగునొక్క నరుఁడని । యనకు లేవు
డచ్యుతుఁడు మదిఁదలఁచిన । నణఁగు నఘము
శరణు వేడినఁ గాచును । సీతనొసఁగి
ప్రార్థనల్ సల్పఁ గొప్పగు । బ్రదుకఁ దెరువు.

మీరు కోరిన వనితలే కఱవగునురా? మిమ్ముల సతతము దూషించు సీతను జేఁబట్టి మీ రనుభవించు సౌఖ్యము లేమి? తొల్లి యెందఱెందఱు పరదారులఁబట్టనెంచి, యిడుమ లందియుండిరో తెలియరా? ఇంద్రుఁ డంతటివాఁడు, పతివ్రత యగుయహల్యను మోహగించి, యెట్టికష్టము లందెనో వినియుండలేదా? పాషాణమై యున్న అహల్యకు శాపవిముక్తిఁ గావించినమహానుభావుఁడు శ్రీరాముఁడు.

రావ—సఖీ! కడసారిగ నాపల్కులను వినుము. ఆశ్రీరాముం డవతారపురుషుఁడనియు, సీతమహాలక్ష్మియనియు నీవు నాకు భీతిఁగొలుప నేల? ఒకవేళ నాతఁ డట్టివాఁడేయైన నిఁక భయమేల? ఆతనిచేతిలో మరణమే ప్రాప్తించెనా? పుణ్యలోకము లందఁ దగును. ఆతని నే రణమున గెలువఁ జాలితినా! మల్లోకంబులఁ గీర్తి వడయఁగూడును కాన,

గీ. సమరమే శక్యమగు నింక ? సాముమేల ?
రాముఁ డన్నను భీతిల ? రామసీత
విడువఁ జాలను పడఁతిరో ? విడువు మనుచు
బలుక వలదింక మరలుము ? భయము దేల.

(అని రావణుఁడు నిష్క్రమించును.)

—అయ్యో! నా నాథుఁ డెన్నివిధముల హితములఁ బల్కినను బెడచెవిని దాల్చెనే కాని, విననొల్లకుండెను హా! దైవమా! ఏమిసేయుదాన? ఎట్లైన నిఁక శ్రీరామునివలన నీతనికి ముప్పు వాటిల్లక మానదు. ఏమైనను పరమేశ్వరునిదే భారము దైవ మనుకూలించినవేళ నన్నియు శుభదాయకములే యగును. లేకున్నఁ జేతికఱ్ఱియే పామై కఱచును. రాముఁడు భగవానుఁడని తెలియును. ఆతనివలన దనకు మరణము తప్పదనియుఁ దెలియును. అయిన నేమి ప్రయోజనము? మృత్యువు తలఁబట్టి యీడ్చుతఱి బోధలు చెవికెక్కునా? హా! నాథా! నాథా! ఇఁక నినుజూచు భాగ్యమున్నదో లేకున్నదో కదా.

(తెరపడును)





శ్రీ

# లంకాదహనము.

అను

# విభీష పట్టాభిషేకము.

## సప్తమాంకము.

లంకాపురీ రాజసౌధము.

[ప్రవేశము:—రావణుఁడు, ఇంద్రజిత్తు]

రావ—కుమారా! తుదకు మన కపజయమే పాసగునట్లు తోఁచుచున్నది.

ఇం—ధీరచిత్తులగు మీరలే నేఁ డిట్లధైర్యమును బూనితిరేల?

రావ—రానురాను మనసేన లన్నియు క్షీణించుచున్నవనియు, వానరసేనబల మధికం బగుచున్నదనియు నిప్పుడే తెలియ నయ్యెను. సేనాధిపతులెల్లఁ జాలమట్టు కందఱును బరలోకమునకుఁ జనియుండిరఁట ఇఁకఁ గర్తవ్యమేమియో తోఁపకున్నయది.

ఇం—ఓహో! ఇదేటి వింత? రణమున నుభయపక్షులవారును మరణించుచుందురు. ఒక్కఁడును జావకుండగనే జయము చేకూరునా?

రావ—కుంభకర్ణుఁ డింకను నిద్రనుజిక్కియేయున్న వాఁడు కాఁబోలును.

ఇం—(క్రోధముతో) జనకా! నాప్రతిన వినుఁడు. ఏ నిప్పుడే యుద్ధభూమికిఁ బోయి, నా బలపరాక్రమములు వెల్లడింపఁ జేసి,

యా రామలక్ష్మణులు ముందుగ నా యమపురికిఁ బంపివచ్చెదను.

గీ॥ రామలక్ష్మణులను బట్టి । రణమునందు
గూలఁగాఁ జేసి యరుదెంతు । గూడ దిట్లు
చింతనొందుట యేటికి । శీఘ్రగతిని
శత్రువుల రూపుమాపగ । జయము రాదొ.

ఏ నిప్పుడే పోయివచ్చెదను. సెలవొసంగుఁడు.

రావ—మంచిది. పోయిరమ్ము. ఆ రామలక్ష్మణు లసమానధీరులు. రణస్థలిని జాగ్రత్తగ సంచరించుము. పోయిరమ్ము.

(ఇంద్రజిత్తు నిష్క్రమించును.)

రావ—నేఁ డేలకో యశుభసూచకము లెక్కుడుగఁ గన్పట్టుచున్నయవి. కతం బేమైయుండును? సేవకా!

[సేవకుఁడు ప్రవేశించును.]

సేవ—రాక్షసకులసార్వభౌమా! ఏమియాజ్ఞ?

రావ—నీ వేఁగి తగినసన్నాహములు గూర్చుకొని కుంభకర్ణునిఁ దోడ్కొని రావలయును. శీఘ్రముగ బొమ్ము.

సేవ—మహాప్రసాదము. (అని కొంతదూర మేఁగి)

(32 వ అనుబంధము.)

(తనలో) అయ్యో! రానురాను లంకాపురి యెట్లు కళావిహీనమగుచున్నదో యట్లే మా రాజేంద్రుని మోమును వెలవెలబాఱుచున్నయది. క్రూరుల కెన్నిటికినివిజయముకలుగ నేరదనుట నిశ్చయము. ఇప్పుడేను పోయి కుంభకర్ణుని మేల్కొలుపవలెనఁట. ఆయనమేల్కొనుటయు, యుద్ధమాచరించుటయు రెండును గల్లయే. అయిన వానిని నేను నెటువేర్చుకొనకతప్పునా?

(అని నిష్క్రమించును.)

[తెరలో]

రాక్ష సేంద్రా! మనకే జయము ప్రాప్తమైనది. రామలక్ష్మణులు రణరంగమునఁ గూలినారు.

రావ—(ఆశ్చర్యసంతసములతో) ఏమేమీ? రామలక్ష్మణులు మడిసిరా? ఆశ్చర్యమాశ్చర్యము!! (అనిలోనికేగును.)

(తెర పడును.)

రెండవరంగము.

రణభూమి.

[రామలక్ష్మణులు నాగపాశబద్ధులై పడియుండఁ జుట్టును సుగ్రీవాదివానరులు, విభీషణుఁడు దుఃఖించుచుందురు.]

సుగ్రీ—హా! రామచంద్రా!

గీ. రావణాదిదుష్కర్ముల । రణమునందుఁ
గూల్చి జానకి శీఘ్రమే । కోర్కెదీరఁ
గూడనగునంచుఁ బల్కితే । కూలి తిట్లు
తెరువు కలదొక్కొ మాకింక । ధీరచరిత.

అయ్యో! రాఘవా! రఘుకులతిలకా! కేవలపరమాత్మస్వరూపుఁడవనియు, అవతారమూర్తివనియుఁ, బదునాల్గుభువనముల వెదకి చూచినను నీకెదురై వర్తించువారలు లేరనియు నమ్మియుంటిమే కాని, యిట్లకారణమృత్యువువాతఁ బడుదువని కలనైనఁ దలంపలేదుకదా. భక్తజనపోషకా! రావణాది దుష్టరక్కసుల నెల్ల రూపుమాపి, లంకారాజ్యమునకు విభీషణు నధిపునిగాఁ జేసి, భూజాతను జేపట్టి సంతసపసౌఖ్యంబుల నయోధ్యకు సోదరసమేతంబుగఁ జేరువాఁడనని పల్కియుంటివే. ఆపల్కులన్నియునీకు నేఁ డెట్లుమఱపునకువచ్చెను. హా! సీతామనోహరా! నీ కీరణ

మునునెంతయో యుపకార మాచరించి, నీచే మెప్పువడయఁజాలు దునని సంతసించుచుంటినే ఆసంతసమంతయు నంతమొందుకాలము ప్రాప్తించెనా? తండ్రీ! జగన్నాయకా! నీమృదుమధురాలాపములు నేఁ డేమైపోదాగి యుండెను. ఈవార్తయే, యాభరతాదులచెవిసోకిన నిఁక వారును జీవములఁ బాయుదురుకాఁబోలును! క్షణక్షణమున నేయాలోచనలు కావలసినను, సుగ్రీవా! యిందు నీయభిమతమేమని పలుమరు యడుగుచుండువాఁడవే? అయ్యో! ఇఁక నా కాభాగ్యము లేకపోయెనా? మీరు సోదరులిరువురును రణస్థలిఁబడియుండ, మాకిఁక కిష్కింధయేల? రాజ్యసుఖములేల? మేమును మీవెనువెంటనే యరుదెంతుము. సుమిత్రాతనయా! సోదరునిఁ బడనాడనోపక, సకలసౌఖ్యంబుల విడనాడి, వనములఁ జేరవచ్చి యందులకుఁ దుదకు నీయగ్రజుని నిప్పుడు కూడ వీడఁజాలక వెంటనంటితివా? ఎట్టిధన్యాత్ముఁడవో కదా! మేమెంతకృతఘ్నులమై చరింపవలసిన కాలము ఘటించెను. ఓపంచభూతములారా! రామలక్ష్మణు లీరీతిఁబడియుండఁ జూచి చు నూరకుండుట మీకు న్యాయమగునా? ఓ దేవేంద్రాదిసురలారా! మీమేలుకొఱకై రాము డీరీతి నవతారపురుషుఁడై జన్మించినది? ఇప్పు డాతడు పడియున్న వేళఁ గాపాడుటకు రాఁజాలరా? అయ్యో! వీరిని గాచువారొక్కరును గాన్పింపకుండిరే. హా! హతవిధీ!—

హను—(దుఃఖించుచు) (23 వ అనుబంధము.)

అయ్యో! మేమెంత పాపాత్ములమైతిమి. ఇనకులభూషణా! శ్రీరామచంద్రా! మాపై నింత క్రోధమూని పలుకకుండుటకు మేమొనర్చిన తప్పిదమేమి? రామా! రామా! ఆ యశోకవనమున నొడవానల కోర్చి, [illegible]లస్వామినియగు సీతా

మహాదేవి, యింక నీవెన్నఁడు యేతెంచి, దుష్టరక్కసులం బరిమార్చి యామెను జేపట్టుదువని, తలపోయుచు జీవములతో నిల్చియుండెను. అక్కటా! యీవార్త యామెచెవిసోకిన—కటకటా! దుర్భరము. దుర్భరము. తలఁచినంతనే గుండెలు ఝల్లుమనుచున్నవి. దుఃఖమతిశయించుచున్నది. రామలక్ష్మణులారా! యీరీతి నిక్కముగ నంతరించిన భూమ్యాకాశంబు లింకనుదలక్రిందుగాక యెట్లునిల్చియుండెను? రామా! నిక్కమా విగతజీవుడ—అయ్యో! అయ్యో! ఏను దిరుగ యశోకవనమున కెట్లుపోఁగలను? సీతాదేవిమోమెట్లు తిలకించువాఁడ? ఇంతదనుక జరిగిన విషయములన్నియుఁ గల్లలేనా? ఇంతయుఁ గలయేనా? రామలక్ష్మణులకే వినాశకాలమా?

ఉ. ఏగతిఁబోవువాఁడ నటు । లేమని తెల్పుదు సీతగాంచినన్
రాఁగతమేమిఁకి తెల్పు మన । రామునకీగతి కల్గెనంచు నే
నేఁగియుఁ జెప్ప నాసుదతి । యెట్టులనిల్వఁగనోర్చు నింకఁ దా
వేగమె చేరఁబోవుఁ బతి । వెఱ్ఱితనంబగు యోలపోవుటల్.

అంతకన్న నిచ్చోటనే జీవములఁ బాయుటెంతయు శ్రేయోదాయకము.
విభీ—కరుణాసముద్రా! రామచంద్రా!

గీ. దుష్టరావణుఁ బరిమార్చి । తొలఁగఁజేసి
లంక నేలంగఁ జేసెదఁ । బంకమంచు
పల్కియుండియు మఱచితే । భవ్యచరిత
పాడియగున యీరీతిని । బాయ మమ్ము.

రఘువంశోద్ధారకా! రామా! నన్మఱికెవ్వండి యుఱగితివి? నాకిఁకేమి దిక్కు. ఆరావణుచేతిలో మరణమే నాకుఁ బ్రాప్తమా? అయ్యో! భక్తవరాధీనా! మిమ్ములనటపాసి యేతీతిమనియుందునోపుదుము? తండ్రీ! జగన్నాయకా! శరణన్నఁ ద్రాతువు

శత్రువునికి సోదరుఁడనియైనఁ దలంపక, సుగ్రీవాదులు రక్కసుని నమ్మి చేరఁదీయవలదని యెన్నివిధముల నుడివినను, ఆర్తశరణ్యమే కర్తవ్యమనియెంచి చేరఁదీసితివే. మహాత్మా! ఆకరుణ నంతయువీడి యిప్పుడిట్లు పలుకకుంట న్యాయమగునా? ఆ సీతాదేవి కిఁక నేదియాధారము? ఆ భరతాదిప్రముఖుల కేదిదిక్కు.

[గరుత్మంతుఁడు ప్రవేశించును.]

గరు—ఈ రామలక్ష్మణులు నాగపాశబద్ధులై మూర్ఛను మునింగియున్నవారలు. జరుగవలసిన విషయములన్నియు మిగిలియే యున్నవి. కాలయాపనకు సమయము కాదు. వీరిని విముక్తులఁ జేసెదఁగాక. (అని రామలక్ష్మణుల విముక్తులఁగ నొనర్ప, యిరువురు లేచినిలుతురు.)

అందరు—(సంతసముతో) మహాత్ములారా! రామలక్ష్మణులారా! మాభాగ్య మేమని వర్ణింపఁగాఁజాలుదుము.

రాము—అదిగో! మనలనిట్లు నాగపాశబద్ధులఁ జేసిన మోఘకాఁడు. యింద్రజిత్తుఁ డదిగో యామేఘములమాటున డాగియున్నాఁడు.

లక్ష్మ—(ఇంద్రజిత్తునిగాంచి) ఓరీ! మూర్ఖా! ఎందుఁ జనెదవు?

గీ. మూర్ఛనము వంగినంత నే। మూఢచిత్త
పోరునందున జయమంచు। పొల్పగునె
ఎందుఁ జొచ్చెదవో యిఁక। యెంచినిన్ను
రూపుమాపక వీడు దే। రూఢిగమ్ము.

(అని బాణముల సంధించును)

ఇం—లక్ష్మణా! ప్రగల్భము లేటికి? శక్తియున్న విల్లుఁబట్టుము. ఇదివరకప్పుడమే జరుగుచుగాని, యిప్పుడు మీప్రాణములఁ గొనక విడ్వ యేను.

(అని సంసిద్ధుఁడగును)

విభీ—(లక్ష్మణుని చెవిలో నేదియో చెప్పును)

లక్ష్మ—అట్లనే. (అని బాణమును విడుచును.)

(ఇంద్రజిత్తు విగతజీవుడై నేలఁగూలును.)

(తెర పడును.)



## మూడవ రంగము.

### అశోకవనము.

(24 వ అనుబంధము.)

సీత—(దుఃఖముతో) హా! నాథా! ఇంకన్ను నెంతకాలమిట్లు దుఃఖానలంబున మ్రగ్గుచుండవలెను? ఎన్నటికి నీముఖావలోకనమునఁ జింతాసముద్రమును దాఁటనోపుదునో కదా! అయ్యో! యింకను నాకర్మానుభవమున కంతము కలుగనేరదా? రాఘవా! రావణుని దునుముట కింకను నెన్నినాళ్ళుపట్టును? ప్రాణేశ్వరా! గడువు సమీపించుచున్నయది. ఈలోపున నన్నీచెఱనుండి విడిపింపఁజాలవా? అయ్యో! సంగ్రామవిశేషము లేమియుఁ దెలియకుండెనుగా! ఈ దుష్టాత్ముఁడు సాధారణముగ నాశమొందునా? కటకటా! ఎన్నినాళ్లీశోక మనుభవింపఁ జాలుదును?

[తెరలో]

రావ—(శోకోద్రేకమున) ఏల నన్నువారించెదరు. ఏవనితచే నాసేవలన్నియు నంతమొందుచుండెనో, ఏవనితచే శూరశిఖామణు లెల్లఁ గూలిరో, ఏదుర్ధమురాలివలన నాప్రియసుతుఁ డింద్రజిత్తుకూడ మృతినందెనో యట్టి దుర్మార్గురాలిని—సీతను వధియించి రక్తపానమొనర్చెదనుగాక.

సీత—(భీతహృదయయై), అయ్యో! ఈ దశకంఠుఁ డుగ్రుఁడై యరుదెంచుచున్నవాఁడు నేటితో నాకిఁక యంతమే కాఁబోలును హా! నాథా! శ్రీరామచంద్రా!

గీ. కష్టములకెల్ల నోర్చితి । కడకు మృత్యు
వే దరిని జేరగనుండె । నోదయార్ద్ర
హృదయ కావుమీ యెడనైన । నోర్వఁదగున
గడుపశక్యంబు యీయార్తిఁ । గావకున్న.

[ఖడ్గమునుబూని రావణుఁడును, వానిని వారించుచు
సుపార్శ్వుఁడును బ్రవేశింతురు.]

సు—దానవేశ్వరా! వనితను నిష్కారణముగ వధింపఁ జనునే?

రావ—ఈదుష్టాత్మురాలివలననేకదా మనలంకారాజ్యమున కిట్టిపాట్లు జనించెను. ఇంకను నీ పెయెడఁ గనికరమా—శాంతమా.

సు—ఆర్యా! అట్లుకాదు నాపల్కులనాలించుఁడు. రణరంగధీరులై యుద్ధమున రామలక్ష్మణులను, వానరసైన్యంబులతోఁ గూల్చి, ప్రసిద్ధినొందుట మీవంటి ధీరచరితులకు న్యాయమగును గాని, ఏపాపమెఱుంగని యువిదను నిష్కారణముగ వధించిన నేమిప్రయోజనము? ఈమాత్రము శంకింపవలదా!

రావ—అగునగును. రమ్ము. రణరంగమున కేఁగుదము.

[తెరలో]

ఓదైత్యకులాగ్రణీ! రమ్ము. రక్షింపుము. రక్షింపుము. మే మీనిశిత బాణజ్వాలల కోర్వఁజాలకున్నాము.

రావ—సుపార్శ్వా! అదియేమి? మన రక్కసులలోనే కోలాహలము జనించినది. తడయుటకు సమయముకాదు. రమ్ము. రమ్ము.

(అని యిరువురును నిష్క్రమింతురు.)



నాల్గవ రంగము.

యుద్ధభూమి.

[రామలక్ష్మణులు, రావణకుంభకర్ణులతో పోరాడుచుందురు.]

రాము—ఓ దైత్యకులాధములారా! నేఁడైన మీ రీరాముని చేతిలో మడియుట నిక్కము. కాచుకొనుఁడు.

(అని యొక బాణమును విడుచును)

లక్ష్మ—ఓహో! రావణకుంభకర్ణులారా! రండు. రండు. కాలుఁడు మీకై యెదురు చూచుచున్నవాఁడు. ఓరీ! రావణా! నీ దర్శనమునకై వేచియున్నాము. ఇంకెందుఁ జొచ్చెదవు? మా ప్రతాపము లివే కనుగొనుము. (అని బాణమును వదలును)

[ప్రవేశము: విభీషణుఁడు, సుగ్రీవుఁడు, హనుమదాదివానరులు]

రాము—ఓ వానరవీరులారా! కడసారి యని రావణకుంభకర్ణులే నేఁడు రణరంగమునకు వచ్చియున్నవారు. కాలయాపనమేల? ముందుగ మీరంత కుంభకర్ణునితోఁ బోరుసల్పుఁడు.

(అందఱును సన్నద్ధులౌదురు.)

కుంభ—(కోపముతో) ఓరీ! నీచులారా! మీరా నన్ను గెల్చుట? మీరందఱు నా కెరయగుటకే యాధాత మిమ్ముల సృష్టించెను గాఁబోలును. మీరు పోయినను పోనిచ్చువాఁడనుగాను

(అని వానరుల మ్రింగఁజూచును)

రాము—ఇఁక శాంతమూనుట తగదు! వానరసేనలన్నియుఁ జెల్లాచెదరగుచున్నవి. ఓరీ! కుంభకర్ణా! ఇదిగో! ఈ బాణముచే మడిసెదవుగాక. (అని బాణమును విడుచును)

(కుంభకర్ణుఁడు హా! హా! ధ్వనులతోఁ గ్రిందపడి ప్రాణములు విడుచును)

వానరులు—రామచంద్రా! ఇఁక రావణసంహారము మాత్రము మిగిలియున్నది

నీకు నిక్కముగ నాతో సమర మొనర్ప భీతియే జనించినచో మరలి
పొమ్ము. నా కీవు బుద్ధిగఱప నగత్యము లేదు.

రాము—అయిన నీకింకఁగాలయాపనమేల? చెప్పవలసిన దేదియో చెప్పితిని. కాచికొమ్ము.

లక్ష్మ—అగ్రజా! ఈతని నేనే దునుమాడెద నొకింత తాళుఁడు. ఓరీ! రావణా! రామలక్ష్మణుల నెట్టివారో నీకుఁ జవిచూపించెదఁ గాచికొమ్ము. రాక్షసేంద్రుఁడననియుఁ బలపరాక్రమశాలిననియు విఱ్ఱవీగుచుంటివి. (అని బాణమును వదలును)

రావ—ఓహో! ఈతని ప్రలాపము లభివృద్ధి నొందుచున్నయవి. కానిమ్ము. ఈమాయాశక్తిని బ్రయోగించి యీ లక్ష్మణుని మూర్ఛిలఁ జేసెదఁగాక.

(అని శక్తిని బ్రయోగించును.)

లక్ష్మ—హా! హా! అగ్రజా! (అని మూర్ఛను మునుంగును)

రాము—(లక్ష్మణునిమీఁదఁ బడి) అయ్యో! తమ్ముఁడా! లక్ష్మణా! ఇంకేమి తెరువు? తమ్ముఁడా! పలుకవేమి? హా! ఇఁక నాకెవ్వరు దిక్కు? సుగుణాలంకారభూషణా! గోరుచుట్టుమీఁద రోకటి పోటనునట్లు నీవుగూడ నన్ను విడనాడుచుంటివా? హా! దైవమా! ఇదేమియాగడము. సోదరా! సోదరా! నీప్రియోక్తులకంతమేనా? లక్ష్మణా! నాయీతాపాగ్ని నెట్లుసహింపనోపుదును? అయ్యో! నాతోడ వనములకుఁ జనిన నీకు నాయుండబట్టి వాత్సల్యత యేలజనించెవలదనియెంతగ బ్రతిమాలినను వినవైతివిగదా! సౌమిత్రీ! లోకమంతయు నంధకారమయమయ్యెను. ఈపదునాల్గువత్సరములు నిద్రాహారములనే త్యజించి సోదరునకు సేవ సల్పినందులకు ఫలిత మీరీతినసముకూరెనా? తండ్రీ! కటకటా! నీవులేక నే నాయయోధ్య కేరీతిఁ బోవువాఁడ? సుమిత్రాదేవి

మొదలుగవచ్చి సోదరుఁడేసన—అక్కటా! ఏమని తెల్పుదును?
అయ్యో! సీతకై యార్తినిపొక్కుచు మరణించిన, సోదరుఁడు
జీవించియుండునుగదా. హా! తమ్ముఁడా! నీమోమెంతగో కళా
విహీనంబయ్యెను. నిన్నీరీతివదలి, పురమునకేఁగి యాయమ్మకు
మోమెట్లు తిలకింపువాఁడ ఓ జీవములారా! అయ్యో!
యింకను బాయక, యీపాపాత్ముని. మేను నంటియుంటిరా?
భూమ్యాకాశంబులారా! నన్నిమిలోఁగలుపుకొనుఁడు. సుగ్రీ
వా! ఇఁక నీ వీసేనలతో పురమునకు మరలుము. ఇఁక నాకీ
యుద్ధమేల? సీతయేల? నా సోదరుఁడు లేక నాకీ యిహలోక
సౌఖ్యము లెందులకు? హనుమంతా! నీ వాచరింపఁదగిన నుప
కారము లన్నియు నొనర్చితివి? ఇఁక చేయవలసిన పను లెవ్వి
యును లేవు. అన్నియుఁ బూర్తియయ్యెను. నాసోదరుఁడే
నన్నుఁ బాసి పోయెను. అంగదాది ప్రముఖులారా! మిమ్ముల
నింతదనుకఁ గష్టపెట్టినందులకు క్షమింపుఁడు. ఈ రాముఁ డిక
హతభాగ్యుఁ డయ్యెను. తమ్ముని జేతులార వీడిన యధముఁడు,
నవుఁబోలు దురదృష్టు లింకొక్కరుండను. మీరు కిష్కింధకు
పొండు. విభీషణా! ఈ రాముఁడు మునుపటి రాముఁడు కాఁడు.
నీకు లంకారాజ్య మొసంగెదనన్న రాముఁడు గతించెను.

సుగ్రీ—రామా! ఇనకులోత్తమా! మీయట్టి ధీరచరితులే యిట్లధై
ర్యచిత్తులై దుఃఖాంబుధిని మునింగిన నింకేమి తెరవు?

విభీ—రామచంద్రా! మిమ్ముల నోదార్చుటకు మేము సమర్థులమా
ఇట్లు దుఃఖాకులచిత్తులై ధైర్యలక్ష్మిని విడనాడుట పాడియా!
ఈతఁడు మూర్ఛను మునింగియున్నవాఁడు దానిఁ బాప
యత్నించుఁడు.

రాము—అయ్యో! ఇంకా యత్నమా? నా తమ్ముఁడు తిరుగ నాతోఁ బల్కునా? నేనంతటి యదృష్టవంతుఁడనా?

జాంబ—సుషేణా! కర్తవ్య మూహించుము.

సుషే—సూర్యోదయాత్పూర్వమే ద్రోణాద్రికేగి, యందున్న విశల్యకరణినిఁ గొనివచ్చిన నీతఁడు పునర్జీవితుఁడగును. సందియములేదు.

జాంబ—హనుమంతా! నీవే యందులకు సమర్థుఁడవు. రామభక్తాగ్రేసరా! తడవేల బయలుదేఱుము. అచ్చోట కేఁగునప్పుడు రక్కసులు మాయాకృతులఁ దాల్చి మోసపుచ్చఁ జూతురు. వానిని లెక్కసేయక సూర్యోదయంబునకుఁ బూర్వమే రావలయునుసుమా!

హను—రామచంద్రా! సెలవొసంగుము పోయివచ్చెదను.

రాము—హనుమంతా! మమ్ముల సుఖముగ నయోధ్యకుఁ జేర్చుట నీయదే భారము. శుభమగుఁగాక. పోయి త్వరితముగ రమ్ము.

(హనుమంతుఁడు నిష్క్రమించును)

లక్ష్మణా! మూర్ఛాసముద్రమున మునింగితివా? ఒకసారియైన నా పల్కు జవదాఁటి యెఱుంగవుకదా! ఈ వనవాసము నిన్నుఁ జంపుటకే దాపరించెనా? నామూలమున జనకుఁడు మరణించెను. సోదరుఁ డెడబాసెను. ఇఁక నేను మాత్రము పాడుజీవముతో నిల్చెదనా?

విభీ—శ్రీరామచంద్రా! హనుమంతుఁడు వేగమె రాఁగలఁడు. లక్ష్మణుండును సుఖసుప్తుఁ డగును. ఈరీతి చింతాకులము విలపించిన నేమిఫలము? ఇట్లు సకలలోకైకవీరుఁడవు నీవే యిట్లు దుఃఖాకులస్వాంతుఁడవైన నిన్నోదార్చఁగలవారు?

రాము—సుమిత్రాతనయా!

సీ. తల్లిదండ్రులఁ జేరి । తమ్ముఁ డేఁడని పల్క
ప్రత్యుత్తరం బేమి । పలుకువాఁడ
సోదరు లేతెంచి । సుగుణాత్ము లక్ష్మణుఁ
జూపుమన నెవరిఁ । జూపువాఁడ?
పతి యేతెంచె నటంచు । భావించు నూర్మిళఁ
దాల్మి నేరీతి నో । దార్చువాఁడ?
గురువులు ననుఁగాంచి । కూర్చి సోదరుఁ డేడి
చెప్పుమన్న నేమని । చెప్పువాఁడ?
గీ. పురజనుల నెట్లు మోదార్తు । భువిని నింక
బ్రదుకఁజాలుట సున్నయా । భవ్యచరితుఁ
బాసి చరియించు నట్టి ని । ర్భాగ్యుఁడయ్యొ
రాముఁ డేలను పురమేల । రాజ్యమేల?

జరిగిన వన్నియు క్షణభంగురంబులయ్యె. (పైకిఁ జూచి) అయ్యో! తెల్లవారుచున్నది హా! హతవిధీ! ఇఁక నా సోదరుఁడు నాకు లభింపకుండును గాఁబోలును. ఓ ఆదిత్యా! నీకును యీ రాముఁడు శత్రువర్గములోని వాఁడయ్యెనా? ఇంతకాఠిన్యమా! అగును. నిర్భాగ్యులయెడ నెవరికిఁ గనికర ముదయించును? (క్రోధముతో) నా ముద్దులతమ్ముఁడే నాకు లేనివేళ, యీ సూర్యచంద్రులేల? ఈలోకమేల? ఓరీ! సీతా!

చ. ఇనకులవంశ సంభవుఁడు । యీగతి మూర్ఛను బొందియుండ నీ
కనువగునే చరింప నిటు । ఆగుమిటే నిను యంతమొందగా
కనుబడకుండఁ గూల్చెదను । కావఁగఁ జాలెడు వారలుండురే
వినయముఁ దోపవేఁడ మది । వింతగఁ దోఁచెను కాముకాంధ్యతన్.

నా బాణ మమోఘమని యెఱుంగవు గాఁబోలును. (అని దిగ్గన లేచి) బాణమును సంధించును.)

విభీ—రామా! ఈ తత్తరపాటేమి? హనుమంతుఁడు ద్రోణాద్రిఁ గొని వచ్చుచున్నవాఁడు. అదియే యీ కాంతి. అంతియే కాని, యే. పాపమెఱుఁగని భానుని రూపు మాపనేల? ఇది ధర్మముగునా?

రాము—ఏమి! హనుమంతుఁడే వచ్చుచుండెనా?

[ప్రవేశము:—ద్రోణాద్రిఁ గొని హనుమంతుఁడు.]

రాము—(హనుమంతుని కౌఁగిలించుకొని) భక్తాగ్రేసరా! ఆనాఁడు సీతజాడల దెలిపి జీవములఁ గాపాడితివి. నేఁడు సోదరునిఁ జేర్చి సంతసమును జేర్చినాఁడవు. నీ మేలును మఱువగలనా?

హను—ఇంతయుఁ దమ కటాక్షమే కాని, వేఱొండుకాదు.

సుగ్రీ—సుషేణా! కర్తవ్యముఁ జూడుము.

(సుషేణుఁడు విశల్యకరణిఁ గొని లక్ష్మణుని నాసికకడనుంచ లక్ష్మణుఁడు మూర్ఛను దేఱును. అందఱును సంతసాంబుధి నోలలాడుదురు.)

లక్ష్మ—అగ్రజా! ఆ దుష్టదానవుఁ డెందుండెను?

రాము—(చేరదీసి) సౌమిత్రీ! నీ వీ హనుమంతుని ప్రేమచే పునర్జీవితుఁడవైతివి. (తెరవంకజూచి) ఓరీ! రావణా! పాఱిపోవుట యేల? రమ్ము. రణరంగమున నెదురై నిలువుము.

[తెరలో]

రావ—మీరక్తపాన మొనర్పక, యీ రావణుఁడు మిమ్ముల వీడి చనువాఁడు కాడు. ఇదే వచ్చుచున్నాఁడ.

[అనుచు రావణుఁడు ప్రవేశించును.]

రాము—లక్ష్మణుఁడు మూర్ఛిలినంతనే జయమందితి నని పొంగుచుంటివా? ఇదే కాచికొమ్ము. (అని బాణములు వదలి) అయ్యో! ఎన్నివిధములఁ బ్రయత్నించినను, నిరర్థక మగుచున్నదే. వీనిని సంహరించుట కల్లయగును ఏమి! ఈతని

సామర్థ్యము. విభీషణా! ఎందఱినైన జయించితివి కాని, యీ
రావణు గెల్చుట కసాధ్యము శిరములు దునిమిన కొలఁదిని
తిరుగ నెప్పటియట్లులఁ గూడుకొనుచున్నవి.

విభీ—రామా! ఈతని హృదయమున నమృతకలశమున్నది అది
యున్నంతదనుక జయింప నెవ్వరికిని శక్యముకాదు. ముందుగ
దాని నాగ్నేయాస్త్రమున దగ్ధ మొనర్పవలెను.

రాము—అట్లే చేసెదఁగాక.

(అని యాగ్నేయాస్త్రమును బ్రయోగించును)

రావ—హా! దుర్మార్గా! విభీషణా! రహస్య మెఱిగించితివా? కార్భ
రము దుర్భరము (అని క్రిందపడి మృతినొందును)

విభీ—(రావణుమీఁదఁ బడి) హా! సోదరా! శ్రీరామచంద్రునితో
పోరాటము వలదని నుడివిన వినక, మూర్ఖచిత్తుడవై తుద
కీగతి ప్రాణములఁ బాసితివా? దనుజేంద్రా! ఎట్టిపరాక్రమ
మున్న నేమి ఫలితము? సీతామహాదేవి నేల చెఱఁబట్టితివి?
ఎందఱు నీ శ్రేయమును గోరి హితములఁ బల్కినను, యప్ప
న్నియుఁ గల్లలని యెంచితివే. ఇప్పుడేమి యనుభవించితివి?

రాము—విభీషణా! విచారమంద నేల? ఈతఁడు నిక్కముగ స్వర్గలోక
సుఖము లందఁజనును. దహనాది క్రియ లొనర్పుము. (లక్ష్మ
ణునిగాంచి) లక్ష్మణా! నీ వేఁగి యీతని లంకారాజ్యాధిపునిగఁ
జేసిరమ్ము.

లక్ష్మ—చిత్తము.

రాము—హనుమంతా! సీత కీవృత్తాంతమును దెల్పి రప్పించు యత్నము
సేయుము.

హను—మహాప్రసాదము. (అందఱు నిష్క్రమింతురు.)

తెర పడును.

ఆఱవరంగము:—త్రికూటము.

[ప్రవేశము:—రాముఁడు, సీత, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతాది వానరులు.]

లక్ష్మ—అగ్రజా! సీత మహాపతివ్రతాశిరోమణి, సుగ్రీవునితో సఖ్యమొనర్చి, వాలిని గూల్చుట యీసీతాదేవికై కాదె. వానరసేనఁ గూడి శతయోజనంబుల విస్తీర్ణమైన వారధిని గట్టుట జానకికొఱకు కాదా? రావణాదివీరులను రణమున దునుముట భూజాత నిమిత్తమేకదా. ఇన్నియు నాచరించి, నిష్కళంకమై యొప్పు నీ భూలోకమాతను-సాధ్వీమణిని-సీతాదేవిని-అనుమానించుటయా? మీ నామస్మరణఁ జేయక క్షణమైన కాలముఁ బుచ్చి యెఱుంగని పతివ్రతాశిరోమణియే.

రాము—లక్ష్మణా! అగును. అన్నియును సీతకొఱకే కాని సీతను చెఱ విడిపించుటకేని, తిరుగ గ్రహించుటకు కాదని నమ్ముట ఎట్లైన నామె యగ్నిప్రవేశ మొనర్చి, దృష్టాంతమును జూపిననేగాని, గ్రహింపఁజాలను.

సీత—(దుఃఖముతో) మఱది! లక్ష్మణా! ఏనాఁడు నన్ను నిష్కారణముగ దూషించి, సాగనంపితినో నాఁటినుండియు నా యదృష్టపు దినములు బాసిపోయినవి. లేకున్న, నా పతియేల? నాయెడ దోషమెంచుటేల? నాకా యెట్టి దురాత్మురాలినైన, యీ భూమ్యాకాశంబులు నన్ను మడియింపఁ జేయవా? దేవతలెల్ల జూచుచు మూరకుందురా? అగ్నిదేవుఁడు నన్ను దహింపకుండునా? మీపాదముల సాక్షిగఁ బల్కుచుంటిని. మీ నామస్మరణనే తక్క వేఱొండెఱుంగను.

రాము—తస్వీ! నీపల్కులు నిష్ప్రయోజనములు.

సీత—లక్ష్మణా! కాలయాపనమేల? చితిని జేర్పుము.

లక్ష్మ—(కన్నులనీరు నింపుచుఁ బోవును.)

(సీతయు నిష్క్రమించును.)

[తెరలో]

సీత—ఆపద్బాంధవా ! ఓ యగ్నిదేవా !

గీ. మానసేకేవేళ నావిభు ॥ మదిని నెంచి
భక్తిఁగొల్చుచు వీడక ॥ పరగుచున్న
నిష్కళంకనై సతతము ॥ నెగడుచున్న
న్యాయమరసియుఁ జేర్పుము ॥ నాధుకడకు.

(అని యగ్నిప్రవేశమగును)

(అగ్ని ప్రత్యక్షమై సీతను రామునికడకుఁ గొనివచ్చి)

(24 వ అనుబంధము.)

అగ్ని—ఇనకులతిలకా! శ్రీమద్రామచంద్రా! ఈ సీతాదేవి మహాసాధ్వి. దుష్టసంహార మొనరించి లోకముల కెల్ల నుపకారమును గావించితివి. స్థిరకీర్తిని గాంచెదవుగాక. ఈ పతివ్రతాశిరోమణిని గైకొనుము. (అని వెడలిపోవును.)

సత్యము. సత్యము. సత్యము. (అని ఆకాశవాణి నుడువును.)

రాము—(సీతను జేరఁదీసి) కాంతారత్నమా !

ఉ. శంకలు లేవు నామదికి ॥ సాధ్వివటంచు నెఱింగియున్ననీ
వంకను దీఱు నిందలవి ॥ వారిజనేత్రిని రావణుండు తా
లంకను జేర్చియుంచెనను ॥ లాఘవమంతయుఁ బాసిపోవ నా
యంకమునందుఁ జేర్చకను ॥ నాపిరి నైచము లోకనింద నై.

ఇప్పుడన్నన్నో త్రిభువనంబులు లోకులు సీతమహాసాధ్వి సీతమహాసాధ్వియని చాటుదురు. విభీషణా ! సుగ్రీవాధివానరపుంగవులారా ! కైకవిధించిన పదునాలుగేండ్ల వనవాసమును నీకతెండుదినంబులకుఁ బూర్తియగును. భరతుడు వనవాసావగ

తర మొక్కక్షణమైన మా రాక లేక ప్రాణముల ధరియింపఁ జాలనని శపథమూనియున్నాఁడు కాన నీలోపుననే యయోధ్యకుఁ జేరవలయును. మీరెల్లరు నయోధ్యకువచ్చి కొన్నిదినంబులచ్చటనుండి సంతసమును గొల్పుదురుగాక! మనము రేపటి దినముననే బయల్వెడలవలెను. మీయందఱి సాహాయంబునం నడుమనడుమ నెన్నికష్టము లొదవినను దుదకు సంతసమునఁ బురికిఁ జేరనుంటిని.

అంద—మహాప్రసాదము.

(అని నిష్క్రమింతురు)

(తెర పడును)



రంగము—అయోధ్యాపురమందలి రాజసౌధము.

[శ్రీరాముఁడు సీత లక్ష్మణ భరతశత్రుఘ్నులు విభీషణుఁడు సుగ్రీవాది వానరవీరులు వసిష్ఠాదులు ప్రవేశింతురు]

రాము—సోదరా! భరతా! నీసోదరభక్తి యపారము. ఇంతదనుక జటావల్కలధారివై పురమునకైన రాక నందిగ్రామమునందే యుండి పాదుకల మూలమున రాజ్య మొనర్చుచుంటివా? నీ యట్టి తమ్మునిఁ గనినందుల కెంతటి ధన్యుఁడనోకదా.

(అని కౌఁగలించుకొనును)

భర—అగ్రజా! మీతోనడవులసంచరించు లక్ష్మణునివలె సేవఁజేయు భాగ్యము లేకపోయెను గదా. ఇఁక తామీరాజ్యభారమును జేఁబూనుఁడు.

(అని పాదుకల నర్పించును.)

రాము—మంచిది.

వసి—రామా ! రఘుకులసోమా ! పట్టాభిషేకమహోత్సవమునకు
ముహూర్తము సమీపించినది. శీఘ్రమే రావలయును.

రాము—చిత్తము.

అందఱు—గురువర్యా ! కానిండు. కానిండు.

వసి—(కిరీటమును గొని)

సీ. ఎవ్వాఁడు సృజియించె । యిన్నిలోకంబుల
కర్తయెవ్వాఁడగునె । కలచిచూడ
భూభారమును దీర్ప । భువిని మానవరీతి
నవతారపురుషుఁడై । యలరునెవఁడు
దుష్టులఁ బరిమార్చి । శిష్టజనులఁ బ్రోచి
మితిలేని ఖ్యాతిని । మెలఁగు నెవఁడు
దశకంఠు దునుమాడ । తాపసివగిదిని
వనములఁ జరియించి । వరలెనెవఁడు

గీ. అట్టి పరమాత్ముఁడీ రాము । డఖిలశుభము
లందుచును రాజ్యసౌఖ్యంబు । లంది యికను
వరములొసగుచు భక్తుల । వంతదీర్చి
వరలుఁగావుత సతతము । వసుధ నింక.

(అని కిరీటము రాముని శిరముపై నుంచును.)

అంద—తథాస్తు. తథాస్తు.

రాము—మహాత్మా ! ఎంతయు ధన్యుఁడను. అయిన నిట్లగుగాక.

—। భరతవాక్యము ।—

ధర్మమార్గము వదలక । ధరణి నెపుడు
ప్రజలు సుఖులైన భక్తిని । వరలుగాత

పాలితుల పోషణార్థమై । పరమయుత

పాలనంబున రాజులు । పరగుగాత.

అందఱు—తథాస్తు.

(అని మంగళహారతిని పాడుచుండ తెరపడును)

సంపూర్ణము.



# అనుబంధములు



### 1. వ అనుబంధము.

శ్యామరాగము—ఆదితాళము.

ప॥ ఇటులనుట న్యాయమా! మనోహరా! ॥ ఇటు॥

అ॥ ప॥ పటుతరమగు భాగ్యభోగ్యములు పడతులకేలా? ॥ ఇటు॥

1. చ॥ నిజనాథుని సేవలనే - నియతితోఁ జేసినగానది

స్త్రీజనమునకు మేలు - భాగ్య మేమిగలదు నాథా!॥ ఇటు॥

2. చ॥ నాథునితోడిదే - నాతిజీవనము

యీధనధాన్యములతో - యింతులకేమిపని॥ ఇటు॥

3. చ॥ మహిత పాతివ్రత్య - మహామాన్యతలగు మగువలకీ

యిహలోకంబున నాకుంఠితంబే - వేతెత్తైనముగలరే॥ ఇటు॥

### 2. వ అనుబంధము.

కల్యాణిరాగము—ఏకతాళము.

ప॥ జననీ! నీవిట్టులనుట తగునే॥ జన॥

అ॥ ప॥ తల్లీ! తల్లీ! యనిపిల్చెడి నీతనయుని॥ జన॥

1. చ॥ పితృసమాజ్ఞాకృత్య యను - పెద్దలపల్కు వినవే

యాతని సత్సతిమణి - యమ్మగాదె మనుకులకో॥ జన॥

2. చ॥ శ్రీరాముఁడు తండ్రియనుచు - సీతయె నీతల్లియని, కు

మారా! సేవింపుమటంచు - మాతయాజ్ఞయ్యెనుగా॥ జన॥

3. చ॥ మాతాజ్ఞ యటుండనిమ్ము - మావిధి మేమేమర

నోతల్లీ! నరకబాధ - లోర్వఁగలమె తలపుమా॥ జన॥

3 వ అనుబంధము.

పీల్హూరాగము—ఏకతాళము.

ప॥ ఎట్టిపాపపు మాటవింటిని॥ ఎట్టి॥

అ॥ ప॥ నా-చె-వు-లా-రా-నే-॥ నెట్టి॥

1. చ॥ వదినయనుచుఁగ తల్లియనుచు - భావించుచు నామది
సాదరమున సేవించెడి - నే నీవిపదమువ నరయ్యో॥ నేనెట్టి॥

2. చ॥ గుండెవ్రీలదే - తినవుమంటుఁ గల్గదే
ఛీ-ఛీ-యా-బ్రదుకిఁకేల॥ నెట్టి॥

4. వ అనుబంధము.

అరభిరాగము—అటతాళము.

1. చ॥ అమ్మా! నన్ గన్న తల్లి కన్నా - మిన్నాగ నిన్ను
నెన్నికొనుచు మున్న న - న్నిటులనుటతగునా?॥ అమ్మా॥

2. చ॥ లక్ష్మణుడనఁగా - కూ్రరాతుమడని తెలఁచితివే
మిా తప్పోపుత్రి! నీముద్దుబిడ్డఁ డనుచుఁ దలఁచకనో॥ యు॥

3. చ॥ శ్రీరాముని గెల్చునట్టి - చెనఁటిచనుసుఁ డెవఁడమ్మా!
తూరామా! నివెటఁగియు - నిట్టులనుట తగదమ్మా॥ అ॥

5. వ అనుబంధము.

సింహేంద్రమధ్యరాగము—ఏకతాళము.

ప॥ వాకోర్కె ఫలియించె నీ నాటికి॥ నా॥

అ॥ ప॥ యీనాటికి - నాభాగ్యమున॥ నాకోర్కె॥

1. చ॥ జగదేకరూప - సౌందర్యరాశియైన
జానకితోయింటరిగా - లభియించుటచే॥ నాకో॥

2. చ॥ మారీచుమాయచే - మనుజులగు రామలక్ష్మణులుం
యీరాము నిచటవిడచి - చెదలుటచే॥ నాకో॥

3. చ॥ శూర్పణఖావరాళిక్షణము - సమిగిపోవునటుల
కార్పణ్యముదీర నీ - గజగామిని దొరకుటచే॥ నాకో॥

### 6. వ అనుబంధము.

### ముఖారిరాగము—అటతాళము.

ప॥ లక్ష్మణా! నిను నిందఁజేసితి॥ లక్ష్మ॥
అ॥ ప నినునిందఁజేసితి - ఘనబాధలందితి॥ లక్ష్మ॥
1. చ॥ మఱదిలక్ష్మణా! నీమాట వినమిచే
క్రూరరాక్షసుని - బాఱిజిక్కితిని
నేరమెంచకుము - నీసోదరునితోఁ
జేరరమ్ము - ననుఁబ్రోవరమ్ము శీఘ్రమ్ము॥ లక్ష్మ॥
2. చ॥ నీవులేమిచే యీ - నిశాచరుఁడు
కడుక్రూరుఁడై - మర్మదాంధుఁడై
కారులఱచుచుండె - ననుఁగావరావె నా
నేరముసైరింపలేవే? - నిన్ను వేఁడుకొందునో॥ ల॥

### 7. వ అనుబంధము.

### ఫరజురాగము—అటతాళము.

ప॥ ఎందుఁబోయితివే - ధరణిజాతా!॥ ఎం॥
అ॥ ప॥ యిందెందైన వెదకిన - సుందరిగాన్పింపవు॥ వెం॥
1. చ॥ వలదంచు వేడిన - జలజాక్షి నామల్కు-
లలనా! విన కిట్టు - లడవుల కరుదెంచినవీ॥ వెందు॥
2. చ॥ ఏక్రూర రాక్షసులు - యేరీతి నిన్నట్టి
యేమేమిజేసిరో - యెఱుంగంగలేనైతి॥ నెందు॥
3. చ. స్వయముగ నీ వెందు - జనుచుండు టెఱుంగవు
యీయడవుల నిన్నెవ్వ - రయ్యో! కొంగిలివారో॥ ఎందు॥

## 10. వ అనుబంధము.

జంఝూటిరాగము—ఏకతాళము.

వాయుసుతా! తబ్బిబుకు బ్బిదుకు టెట్టుల
అ॥ క॥ వలుభామలకోర్చి యీ నగముపైననో॥ వాయు॥
(1) చ॥ సోదరుడను ప్రేమలేక। న్యాయాన్యాయంబులేక
యీ దార్భాగ్యుండగు వాలి - దుర్మదాంధుడై బాధించెను॥
(2) చ॥ ఏనాటికైన। నా - యీ। యిడుములు తీడమొట్టి
నానా సౌఖ్యములం దేటి। ప్రాప్తము లభియించునో॥ వాయు॥
(3) చ॥ అలిని గోల్పోతిని। అయ్యో। వరాశ్రయమందితిని
ఏదిదొట్లనా। యీలిని మరిబొందఁగలనో॥ వాయు॥

## 11. వ అనుబంధము.

భరవాళప్రియరాగము—ఏకతాళము.

అయ్యో! మనోహరా!
రాము బాణమున నీ। ప్రాణములను విడితే॥ అయ్యో!
(1) చ॥ ప్రాణపదముగ నీవు। పరిరక్షించిన
సూనుడంగదునివీడి। శోకాబ్ధిని వమముంచి॥ అయ్యో!
(2) చ॥ ఈగతి మరిచేమిజేసి। మము బాసితివి
జగదేకశౌర్యధుర్య। సాహసౌదార్యధుర్య॥ అయ్యో!
(3) చ॥ సుగ్రీవుని మాయగనక। యాగ్రహమున వాని బాలి
నిగ్రహింపతే కవిలో। నిల్లితే శ్రీరాముని చే॥ అయ్యో!

## 12 అనుబంధము.

కళిక రాఘరణము—అటతాళము.

ప॥ రామా! మునిజనమందితశ్యామా!

అ॥ ప॥ నీ మహామహిమగన నెవరితరము! రామా!

(1) చ॥ సృష్టిస్థితిలయ । కారుడవౌనను, ని
కృష్టమతినయిందుఁ గలనే । దయజూడుము! రామా!

(2) చ॥ శ్రీమన్నారాయణా - ఆర్తత్రాణ పరాయణా
రామా! భవతారణ రామా! పాపవిమోచన శ్యామా!! రా॥

(3) చ॥ ధరముల్లోకములకు । మూలపురుషుడవీవే
శరణు శరణు సైరించుము శ్రీ రామా!

## 13 వ అనుబంధము.

### రాగమాలిక—ఆటతాళము.

ప॥ కల్యాణరామా! కాపాడరావా!

అ॥ ప॥ నీపదరాజీవముల । గొల్చుచుంటినిగాదా॥ కల్యా॥

(1) చ॥ నినుజూచెడిపాత్రము । నితోమాటాడెడిభాగ్యము
గనుగొనగలదే । కామితమందార నీకల్యాణికి॥ కల్యా॥

(2) చ॥ మాయలేడి యనుచు మదిని దలపక
నాయభాగ్యత్వమున గోరితి దానిని
నాయభిలాషను దీర్ప నీరరుగగాను
యీయభాగ్యుడు ననుబట్టె గాపాడవె శ్రీరామా॥ కల్యా॥

(3) చ॥ మఱదియును నతి । మానములేకయె
కాఱులఅది యతని । నటుబాసి నైచి
దారుణబాధల । దగిలితి నాగిలితి
చేరిబ్రోవవె నీసతిని । భూపాలచంద్ర॥ కల్యా॥

(4) చ॥ నీపావనవదనంబును । నింపారగాగాంచెడి
పాత్రము నాకెన్నడు । పాత్రించునా

పాపి రావణుని । బాధలొలగు నెపుడు
రూపింపలేక యేడ్చెడి సతిఁబ్రోవవె, కన్నడసేయక॥ కల్యా॥
(5) చ॥ నీమోముఁజూపి । నను । నీపాప్రుశేర్చి
వామనోవ్యథ రూపుమాపి । నన్నోమిం
ప్రేముడినాదరించి । ప్రేమఁబ్రోవరావె
కామితమందారా ! । మోహనాకారా॥ కల్యా॥

14 వ అనుబంధము.

అసావేరి రాగము—త్రిపుటతాళము.

ప॥ అకటా ! దైవవిధి దాటతరమే॥
అ॥ ప॥ ఎంతెంతటివారికైన । నియ్యెలలో॥ నక॥
(1) చ॥ ముల్లోకములకు । మూలపురుషుండైన
నల్లలితాంగుని । సాధ్వీమణియే యిడుమలకు లోనయె॥ అక॥
(2) చ॥ ఘనపతివ్రత లీ । గతికష్టము బడుచుండ
గనుగొనతరమే । కన్నులారగ నయ్యో॥ అక॥
(3) చ॥ రాముని నానతియున్నచో । రావణు బరిమార్చి
సేమముగా సీతను । జేర్చియుందు రాముని దరి॥ అక॥

15 వ అనుబంధము.

భైరవి రాగము—అటతాళము॥

ప॥ విశ్వసింపుమమ్మా ! లోకైకజనని నాపలుకు॥ విశ్వ॥
అ॥ ప॥ శ్రీరామదూతనని దెల్పుచుంటి॥ విశ్వ॥
(1) చ॥ సుగ్రీవబంటును । శ్రీరాముదూతను
నిన్నుగాంచవచ్చితిని । కన్నులారగనుఁగొంటిని॥ విశ్వ॥
(2) చ॥ వాయుపుత్రుఁడను । హనుమంతుండభిదానము
ఓ యుర్వీసుత దయజూడుము భక్తుని॥ విశ్వ॥

16 వ అనుబంధము.

ఆనందభైరవి రాగము—ఏకతాళము

ప॥ రామా! దశరథరామా! సద్గుణస్తోమా!

(1) చ॥ నీపదంబులనె! నమ్మిదిదలఁచెడి
నీపావనమూర్తిని తిలకించెడి నను గావుము॥ రా॥

(2) చ॥ పాపవిమోచనరామా! భక్తసుపోషణనామా!
నీపావనదయచే! నిక్కముగాపాడుము నను॥ రామా॥

(3) చ॥ కరుణాకర! నీనామ! సంస్మరణముచే
దురితము తొలగును! తొలగును కష్టములు॥ రామా॥

17 వ అనుబంధము.

శవ్యాసిరాగము—అటతాళము.

ప॥ అయ్యో! అంజనీదేవిముద్దుకుమారా!

అ॥ ప॥ క్రూరరావణునిచే నేమయిపోయితో॥ అయ్యో॥

(1) చ॥ శ్రీరామునిచెంత చేరగ నరుగక
కూ్రరరాక్షసులచేతి కేలజిక్కితి॥ వయ్యో॥

(2) చ॥ వనమెల్ల పాడుజేసి దనుజాధములను
దునుముటలగునే! మారుతికొకుమారా॥ అయ్యో॥

(3) చ॥ వాలమునకు నిప్పంటించిన! పాపము నీగతియేమయ్యేనో
లీలపతివ్రతనైనయామెడల! నీకు బాధలేకుండుగాక॥ అయ్యో॥

18 వ అనుబంధము.

హంసధ్వని రాగము—ఏకతాళము.

ప॥ చూచి వచ్చితి రాఘువా!

అ॥ ప॥ సీతామహాసాధ్వీమణిని నే॥ జూచి॥

(1) చ॥ దశకంఠునశోకవనములో । సతతంబును జింతించుచు
దీనామమె మదినెంచుచు । దిమ్మ్రభజియించెడితల్లి ని॥ చూచి॥

(2) చ॥ క్రూరరావణుఁడు । కోరి పలుమార్లామెకు
జేరివేడుచునుండ । చింతచే తపియించుతల్లి ని॥ చూచి॥

(3) చ॥ దుష్టరాక్షసితులమధ్య । కష్టముతో గూర్చుండి
దుష్టవాక్యములవినుచునే । దురపిల్లెడి నాతల్లి ని॥ చూచి॥

## 19 వ అనుబంధము.

### కాంభోజిరాగము—ఏకతాళము.

ప॥ శరణు శరణు శరణు శ్రీరామచంద్రా!

అ॥ ప॥ కరుణింపుము నాభక్తుని గాపాడుము దయతోడుత॥ శర॥

(1) చ॥ పతితపావన । భక్తసుపోషణ । పావనచరితా
గతినీవేయని నీకద । కంజములను వ్రాలితి॥ శర॥

(2) చ॥ జాతికి దనుజుడనని । సంశయింపకు మోదేవా!
జాతితోడఁ బనియేమి । సామీ! నీభక్తునిగాపాడుము॥ శర॥

(3) చ॥ నినుమనసారగ భజి । యించెడి భక్తులగనుగొని
ననవరతమును బ్రోచు చుందువనివింటిని దేవా॥ శర॥

## 21 వ అనుబంధము.

### కల్యాణిరాగము—అటతాళము.

ప॥ ఎటులైనమంచిదే సోదరా! మన॥ కెటు॥

అ॥ ప॥ శ్రీరామునితో బోరుట మన॥ కెటు॥

(1) చ॥ పరమేశ్వరుఁడైన యా । పావనచరితునిచే
మరణముగల్గిన మనకు గావలసినదేమి॥ ఎటు॥

(2) చ॥ ఖండనమున శ్రీరాముని । దండిమగలపై గెల్చిన
నిండుకీర్తి గడియించి । నెగడుచుండు మీరాయుర్వీని॥ ఎటు॥
(3) చ॥ పరమేశునిచే జచ్చిన । పుణ్యలోకములు గల్గును
పరమేశుని గెల్చినచో - ముల్లోకము లేలవచ్చు॥ నెటు॥

21 వ అనుబంధము.

ఖరహరప్రియరాగము—త్రిపుటతాళము.

ప॥ మనవి వినుము నాయనోహరా !
అ॥ ప॥ పదములంటి వేడుకొందు । ప్రేమమీఁజేతు దయను॥ మన॥
(1) చ॥ శ్రీరాముఁడు దేవుఁడని । చెప్పుచుండె ముల్లోకంబులు
యా రామునితో సమరమా । అయ్యో ! మిముప్రార్థింతును॥ మ॥
3) చ॥ మారీచసుబాహుల । మట్టుబెట్టజాలెను
నారాచంబున తాటకి । నెట్టె నరకంబునకంపెను॥ మన॥
(3) చ॥ ఖరదూషణాదుల । గండడగించెను
పరశురాముని గర్వ । పరిహారమొనర్చెను॥ మన॥
(4) చ॥ అట్టివానియిల్లాలిని చెఱ । బెట్టుట మేలగునే
ఎట్టులైన నామెవిడచి । యెలమి నన్ను గాపాడుము॥ మన॥

22 వ అనుబంధము.

ఎఱుకులకాంభోజిరాగము—ఏకతాళము.

ప॥ పోయెరా ! ఈలంకాపురిసొబగు॥ పోయె॥
(1) చ॥ అపరంజిమేడల । యాసొబగు యానీటు
పాడయ్యె మాపూర్వకర్మంబుచే సకట॥ పోయె॥
(2) చ॥ క్రూరుల కేరీతి । గోరిన జయమబ్బు
క్రూరాత్ముఁ త్రిశృణగెడి । సమయంబరుదెంచెను॥ పో॥

23 వ అనుబంధము.

ఫిల్వారాగము—ఏకతాళము.

ప॥ అయ్యో! మాకింక నేదిదారి॥ అయ్యో॥

అ॥ ప॥ శ్రీరామచంద్రు డలుకవహించె॥ నయ్యో॥

సాకీ॥ ఏమి నేర మొనరించితిమో

మేమేమిదోష మొనరించితిమో

మేమవిధేయతతో నడచితిమో

మిశ్రి॥ కారణమేమో। యెఱుఁగరాదు। కంజాక్షుఁడు

కినుకవహించె। నేమిటదీసునో, యేమో॥ అయ్యో॥

24 అనుబంధము.

ప॥ ప్రాప్త మెన్నటికి దొరకునో॥ ప్రాప్త॥

అ॥ ప॥ శ్రీరామచంద్రుని పదవారవిందమును జూచు॥ ప్రాప్త॥

(1) చ॥ నామనోహరుని। వదనపద్మమును

నామనసారగ గాంచెడి। ప్రాప్తమెన్నటికిదొరకునో॥ ప్రా॥

(2) చ॥ కాలకర్మవశమున నీ। కలుషాత్ముని చేతులలో

చాలకచిక్కితి। కర్మతీరకుండ। గడచునకష్టము॥ ప్రా॥

(3) చ॥ క్రూరరావణుఁడు। మడియడయ్యో

చేరువయ్యె గడువు। చెఱవీడి సుఖము॥ ప్రాప్త॥

24 వ అనుబంధము.

హంసధ్వనిరాగము—అటతాళము.

ప॥ శ్రీరామచంద్రా! యినవంశోద్ధారా॥

అ॥ ప॥ పావనచరితా! పతిత-పావనచరితా॥ శ్రీ॥

చ॥ 1. ఈమహాసాధ్వీమణిచరితం
బీరేడులోకంబుల తెలుపఁబడియె
పావనమందార-పాలించుకొమ్మయ్య॥ శ్రీరా॥

చ॥ 2. ఈనెపమున రాక్షసులను
యిట్టివధించిలోకంబుల
సాదరమతినేలితివి గుణ-సాగర॥ శ్రీరా॥

## మంగళహారతి.

కళ్యాణిరాగము—ఏకతాళము.

ప॥ మంగళం శ్రీరామచంద్రా! నీకిదె మంగళం
అ॥ ప॥ మంగళ మమరేంద్రవందిత-మాధవా! ధవా!॥ మంగ॥
చ॥ 1. దశరథనందన-పాపవిమోచన
పావన గుణఘన-పాలిత శుభజన॥ మంగ॥
చ॥ 2. ముల్లోకంబుల కాధారుండవు
సల్లలితాంగా-సల్లలితాంగా-సాధ్యమెపొగడ॥ మంగ॥



# వైజయంతీవిలాసము

అను

## విప్రనారాయణ చరిత్రము

సారంగు తమ్మయామాత్య విరచితము రు 0—12—0.

# విజయవిలాసము

(పూర్వకవి) చేమకూర వెంకటకవి 0-12-0.

స్వారోచిష

# మనుచరిత్రము

అల్లసాని పెద్దనకవి విరచితము రు 0—12—0.

# ప్రభావతీప్రద్యుమ్నము

పింగళి సూరనార్యప్రణీతము రు 0—12—0

---

కొండపల్లి వీరవెంకయ్యా, బుక్ సెల్లరు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

# భోజరాజచరిత్రము

నూతనము. నవరసభరితము.

అపూర్వము. ముక్తిదాయకము.

వెల రు 1-0-0

శ్రీ అయినాపురపు సోమేశ్వరరాయకవిప్రణీతము.

ఇంతవరకు ఆంధ్రదేశమున భోజరాజును విన్నవారేగాని ఆమహారాజు కథలు తెలిసినవారు లేరు. ఆలోప మీగ్రంథమువలన దీరినదని నిశ్చయముగ చెప్పగలము. భోజుని ఆస్థానమందు కవివర్యుల కవితావిలాసములు, కాళిదాసు ప్రతిభ పండితులచర్యలు, భోజుని ఔదార్యము, వేశ్యాంగనా వర్ణనాది చిత్రవిచిత్ర చమత్కారబంధుర సుందరకథావల్లరి నవరసభరితమై, ఆహ్లాదజనకమై మనోమోహనమై చదువువారి చవులూరజేయు చుండును. భోజుని జీవితమందలి గభీర విషయముల చదివి యానందించని వారుండరు. బహుప్రయాసమున పలుస్థలములనుండి వివిధ విషయములసేకరించి వ్రాసిన యీగ్రంథము ప్రతి యాంధ్రుల కరము నలంకరింపదగినది. చక్కని ముద్రణము. 140 పేజీలు.

# ప్రమదామనోహరము

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వర రావుగారిచే" రచియింపఁబడిన 7 అంకముల నూతననాటకము. ఈనాటకము పలుమారు బలువురిచే ప్రదర్శింపఁబడి వన్నెకెక్కియున్నది. ఇందు ధూమ్రకేతు, విజయసేనుని ప్రతిజ్ఞావాక్యములు వినిన భయానకరసంబును, వీరియుభయులను తగవులేకుండ జేయుటకై విక్రమార్కుని నీతిబోధయు, చదివి యానందింపవలసినదే గాని వర్ణించుటవలన లాభములేదు. కథానాయికయగు "ప్రమద" సమయానుగుణ్యముగా జూపించు శోక, ధైర్యస్థైర్యము లొకమారు చదివిచూచిన "సెబాస్" అని యనకుండ నెవ్వరైన నుండగలరా! చంద్రికేశుని పాహా సౌదార్యములు గాంచి ఖళీయనవలసినదే. విజయసేనుని ప్రతిజ్ఞానిర్వహణమును గాంచి శిరఃకంపన మొనరింపవలసినదే. ధూమ్రకేతుని దుష్ప్రితగనం గాంచి ఛీ ఛీ యని తీరుదురు. వేయేల నాటకము గాంచినచో మావ్రాసిన దానియందలి యాథార్థ్యము మీకే బోధపడును. ద్వితీయముద్రణ మిప్పుడే వెలువడినది. త్వరపడకున్నచో ప్రతులు లభింపవు.

వెల రు 0—10—0

---

కొండపల్లి వీరవెంకయ్య, బుక్ సెల్లరు, ఇన్నీసుపేట, రాజమండ్రి.